ఆర్యా,

మీరు వ్రాసిన బ్రహ్మంగారి చరిత్రకు చాలా సంతసించితిని. భవత్కవిత్వము రసోత్తరము గాను శ్లాఘాపాత్రముగానున్నది. ఏతద్గ్రంథ విషయమై నాబుద్ధి పూర్వకముగా నస్మదభిప్రాయము పంపుకుందును.

క్షమింప ప్రార్థితుడ,

కన్నెకంటి ప్రభులింగాచారి.

## నాటక పాత్రములు

### ప్రథమాంకమున.

1 బ్రహ్మ
2 విష్ణుమూర్తి
3 యీశ్వరుడు
4 లక్ష్మీదేవి
5 భూదేవి
6 నారదుడు
7 బ్రహ్మముగారు
8 వేంకటరెడ్డి—శిద్ద
9 వీరభద్రుడు

### ద్వితీయాంకమున.

1 వేంకటరెడ్డి
2 వేంకటరెడ్డి తల్లిదండ్రులు
3 యోగిని
4 బ్రహ్మముగారు
5 గోవిందమ్మగారు
6 యేకాంబరయోగి
7 వటుడు
8 యోగిని

### తృతీయాంకమున.

1 శిద్దడు
2 మల్లయ్య
3 బ్రహ్మముగారు
4 గోవిందమ్మగారు
5 యీశ్వరమ్మగారు
6 గోవిందయ్యగారు
7 పోతులూరయ్యగారు
8 యేకాంబరయోగి
9 పీరుసాహేబు
10 ఆదంబి

### చతుర్థాంకమున.

1 పోతులూరయ్య
2 బ్రహ్మముగారు
3 శిద్దడు
4 భీముడు
5 గోవిందయ్య
6 గోవిందమ్మ
7 యీశ్వరమ్మ
8 యేకాంబరయోగి
9 కుష్ఠువ్యాధిగల బ్రాహ్మణు
10 యీతని భార్య

### పంచమాంకము.

1 బ్రాహ్మణులు
2 శిద్దడు
3 బ్రహ్మముగారు
4 నబాబు
5 పీరుసాహెబు
6 యీశ్వరమ్మ
7 పోతులూరయ్య
8 గోవిందయ్య
9 యీయన భార్య
10 గోవిందమ్మ
11 యేకాంబరయోగి
12 అన్నాజి
13 అప్పాజి

## కవిస్తుతి.

చ॥ జలధిని సంభవించిన వి • షంబును కంఠమునన్ ధరించియూ,
కలువలరేనినిన్ తలను • గన్పడదాల్చిన శంభుభాతినా
దోసియు జాల్యనట్టి కవు • తిత్రప్పు దోషము లుండెనేని మీ
తలపులలోన నుంచి సుకృ • తంబుల వెల్లడి సేయ మ్రొక్కెదన్॥

## గురుస్తుతి.

మ॥ వరకీర్తిస్ఫూర్తి కుంభాంబుధేందు కళా • వ్యాసారకూపార శం
కరుధ్యానైకపరాయణాత్మ పర ర • క్షా లోకనాథ్యుండు నన్
గరుణన్ సత్కవితా ప్రకల్పకునిగా • గన్ జేసి దీపించు మ
ద్గురుకోటీశ్వర శర్మ నెన్నెద మదిన్ • గోర్కెల్ ప్రసాదించగన్ ॥

## ఆత్మబోధను జేయుబడిన గురుస్తుతి.

కం॥ గురుతోడ యాత్మ సుబోధను
సరిగను బోధించి నాకు • సద్గతి నొసగెన్
స్థిరము కనగ పాట్వేరము
నరమర లేకుండ గొల్తు • నాత్మన్ భక్తిన్॥

శ్రీరస్తు.

శ్రీవిరాట్పరబ్రహ్మణేనమః.



# శ్రీ విరాడ్బ్రహ్మానందము.

## ప్రథమాంకము.

శా॥ శ్రీరంజిల్లు ప్రపంచమంతయును తా • సృష్టించి చాతుర్యుఁడా
గారాయించన తోలుబొమ్మల విధం • బాడించు బ్రహ్మంబు నే
డీరాత్రిన్ తననాయకంబును ప్రద • ర్శింపన్ ప్రయత్నించెనో
ధీరాగ్రేసరులారగాంచి ప్రమదా • ధీనాత్ములై మించరే॥ 1

(సూత్రధారి తెరవైపుజూచి)

సూ—నటీనటీ త్వరగా రావదియేమి నీ యలంకారము పూర్తికాలేదా

నటి—(తెరలోన యుండి తీవరించెదవేల॥

గీ॥ పురుషులకే యలంకారము • బూనకున్న
యేమి యనరేము యదిబని • యేమి యంద్రు
స్త్రీ లలంకారమున సదా • జెలగకున్న
యడ్డతనమంద్రు పతియెడ తెడ్డమంద్రు॥ 2

సూ—(రౌద్రముతో) ఆ ఆ యేమది నాటకాలోకనాయత్తచిత్తులై
చప్పట్లతో తీవరించు సభాస్తారుల తీవ్రంబునకే నోర్వజాలక

నిన్ను తీవరించినందులకు త్వరగా రాకపోవుటయే గాక యెడ తెడ్డ మనుచుంటివా॥

నటి— నే ననుటకాదు కాదు కోపింపకుడు॥

సూ— ఎవ్వరనుట॥

నటి— మీ రనుటయే॥

సూ— యెట్లు

(తెర వెలుపల ప్రవేసించి).

నటి— నీవు సరియైన యలంకారము ను జూసి భాస్థారుల మనంబు రంజింప జేయక యడ తెడ్డమున ప్రవర్తించుచుంటివా యని నన్ను గద్దింతురేమో యను యలంకున పూర్ణాలంకృతనై వచ్చుటలో కొంత యాలస్య మైనది క్షమింపుడు (అని నమస్కరించును.)

సూ— బోటి యిదియేమి నాటకంబని యలంకారము జేయుచుంటివి!

నటి— నాథా యేనాటకంబైనను శృంగారరస మిసుమంతైనను జూప కున్న సభాస్థారుల రంజింప జేయుట దుస్తరంబుగదా॥

సూ— అవునౌను రా॥

శ్రీ వీ ర బ్ర హ్మా న ం ద ము.

గీ॥ భక్తిరసమైన శృంగార • పటిమలేక
భ్రాంతిపూర్ణుల రంజింప • బడదు నీదు
మేల్మి బంగారు నగయైన • మెచ్చునటుల
పటికి నార్చక యుడిగిన • ప్రోక్షిగనునె॥ 3

నటి॥ నాథా యీనాటకము భక్తిరస ప్రధానముగా గ్రాలునదియా! యీ నాటకము పేరెయ్యది॥

సూ— కామసీమణీ యింతవరకీ నాటకాభిధానంబె యెరుంగవా॥

శా॥ శ్రీ రంజిల్లు ప్రపంచ మంతయును తా • సృష్టించి చాతుర్యుడౌ
ఠౌరా యంచనతోలు బొమ్మల విధం• బాడించు తద్బ్రహ్మమా
కారం బుద్భవి దాల్చివచ్చి పరసౌ• ఖ్యాకర్షుడౌ పోతులూ
రీవీరబ్రహ్మముగారి నాటకము త• స్వోదీని నామంబహో॥ 4

నటి—ఆహా మనోనాయకా యామహానుభావుని చరిత్ర కొంచెము చెవుల కింపుగా వినుపించెదవా॥

సూ—చెవుల కింపుగా వినుపించుట యేటికి నేత్రానందముగా నాటకమునే జూచెదవులే॥

భూదేవి—॥(తెరలో)

మ॥ గిరులన్ మోసితి వృక్షజాలమును శ॰ క్తిన్ మోసి సింధువ్రజం
బరయన్ మోసితి సప్తవార్ధులననా • యాసంబుగా మోసితిన్
దురితాచారపరాత్మ గర్వితమతిన్ • దుర్మార్గునిన్ మోయగా
బరువై తోచె నికెందరో గలరె నా॰బ్బా యెట్లసీ మోయుటల్. 5

నటి—(ఆలకించి) ప్రాణవల్లభా యెవరో యొక సాధ్వీమతల్లి దీనారావ మొనర్చుచున్నయది త్వరగా బోవుదము. ఈ నాటకము వ్రాసిన కవి యెవరు ?

సూ—(ఆలోచించి).

కం॥ సుగుణుల్ డు త్తముడున్ పా
ల్డుగు దేవబ్రహ్మసుకవి • లో॰కుండున్
జగతిన్ సుబ్బయ సుబ్బమ
కగణిత యశులైన పుత్రు • లందగజుడున్॥ 6

నటి—ప్రియుడా యీ కవి యిదివరలో యేవియైనను వ్రాసి యుండెనా॥

సూ—యెందుకు వ్రాయలేదు ! ప్రప్రథమమున పూర్ణమహేశ్వర శతకమును ద్వితీయమున బ్రహ్మశ్రీ వేలూరి చంద్రయ్యగారి జ్యేష్ఠ పుత్రుండును షట్కర్మ నిరతుండును ఆత్మబోధాంతుండును రాజ యోగానందుండును యీ కవి బంధుండును ఆత్మమిత్రుండును నగు వేలూరి వీరబ్రహ్మముగారి ప్రేరేపణచే వ్యభిచార చరితాపహాస్యార్థ శతకమును తృతీయమున వీరి ప్రోత్సాహమునే యీనాటకమును రచించెను.

(తెరలో భూదేవి)

మ॥ మనుసులన్ ధూరుట నిత్యకృత్యములకై • పుత్రేల్వగల్పన్ విలో

కనముఁ గల్పుట జ్ఞానముఁ విడచి ము • క్త్యాభోగనోద్యోగమే
కనకంబంచు దలంచి మత్తిలుట యిం • కఁ జాల పాపంబు లీ
జనులఁ గల్గె భరింపజాల పరమే • శా భారముఁ దీర్పవే ॥ 7

సూ—— (ఆలకించి) కాంతామణీ యెవరో యొక మహాత్మురాలు దీనాలాపములతో వచ్చుచున్నయది. మన మిటనుండక ఏగుదము పద. (అవనికపడును, నిష్క్రమింతురు.)

వైకుంఠం—— (ప్రథమాంకము.) 1 బ్రహ్మ 2 విష్ణువు 3 లక్ష్మి 4 యీశ్వరుడు కూర్చొని యుండగా భూదేవి ప్రవేశించును. (అందరు లేతురు.)

లక్ష్మి—— (భూదేవిని గౌరవించుకొని) అంబా! యెన్నిదినంబుల కిట కేతెంచితివి. యిప్పటికి తీరినదా! (అని యొకపీఠము పై కూర్చుండ పెట్టి నమస్కరించును.) (అందరు కూర్చుందురు.)

భూ——(సుఖీభవ యని దీవించి) (సరసన కూర్చుండబెట్టుకొని) అమ్మాయీ! యేనిటకు రాలేదని నన్ను నిష్ఠురము లాడుచుంటివా! అయ్యో! నాకెక్కడ తీరిక.

సీ॥ జీవరాసులకెల్ల • జీవనాధారమౌ
ఫలసస్యముల నిచ్చు • పనియు గాదు
భోగజాలంబులు • బాగుజేకొనియొస
పరమక్రియల నిచ్చు • పనియుగాదు
భూషణాలంకార • పూరితకై నవరత్న
గనులను గల్పించు • పనియుగాదు
జగమునకాధార • చరితనై సర్వముఁ
భరియించి మోసెడు • పనియుగాదు
గీ॥ గాని యీపను లెన్నని • కష్టమిడవు
దుర్మదాంధుల మోసెడు • దుర్గభంబు
పని యొకటి వచ్చుటకు వీ • లుపడగనీక
యేడుపించుచు నున్నది • కేమిసేతు॥
(అని దుఃఖముతో కూర్చుండును.)

లక్ష్మి— భూదేవతా! యేలదుఃఖించెదవు దుఃఖింపకుము॥
విష్ణు— ధరణీదేవతా! పూర్వము క్రూరదానవ ప్రళయములు మునుల వలన విని, మహారోషోద్దీపితమానసుండనయి.
మ॥ పదియాకారము లాఁ ధరించి దురిత • వ్యాపారులఁ ద్రుంచి భా
స్వదలంకారముగా సురల్మునులు హె • వర్ధిల్లగావించి భూ
రిదయఁ భక్తుల నిష్టసిద్ధుల ప్రవ • ర్ధిల్లఁ కటాక్షించి స
మ్ముదము మెప్పంగ చరించి నట్టి విభున • త్యుణ్యుండ నేనుండ నే॥ 9
మా— భయపడకుము కొంచెమటు విశ్రమింపుము. (యీశ్వరునిజూచి) మహాత్మా యిందు కేమి సదుపాయము.
యీ— పరాత్పరా యిందుకు సదుపాయమా?
మ॥ చతురత్వంబుగ జీవరాసులనుదం • చత్కీర్తి సృష్టించి యే
గతి యెవ్వానికి యెట్టికర్మము గలుం • గఁ నోష్ట తాత్రాయు నం
గతి తానేగ్రహించి దుర్జనుల శి • క్షాపాత్రులఁ జేసి స
మ్మతి వర్తిల్లెడు నట్లు జేయుటకు బ్ర • హ్మన్నంప యోగ్యంబగుఁ॥
విష్ణు—మహాత్మా! మంచిసంగతి వచించితివి. (బ్రహ్మనుజూచి) తనయా యీపని దీర్పుభారము నీయందే స్థిరపరచితిమి.
బ్రహ్మ— తండ్రీ! అటులనే.
విష్ణు— కుమారా భూలోకంబున కేగివుత్తమాన్వయోద్భవుండవై అల్లాపల్లె వీరభద్రునకు శిష్యుండవై నారదమంత్రోపదేశుండవై సర్వశాస్త్రపారంగతుండవై తత్వార్థముచే దుర్మార్గుల మోక్షమార్గులగా నొనర్చుచూ యీ క్షమాదేవి భారంబెల్లను దీర్చి రావలయును. శివకేశవులమైన మేమెల్లప్పుడు నీకు సహాయభూతులమై దర్శన మిచ్చుచుండెదము. యిదియే మాయాజ్ఞ.
బ్రహ్మ—చిత్తము.
భూ— నాయనా! నాభారము దీర్చగలవా లేదా?
బ్ర— సంశయింపకుము.
మ॥ త్రిపురంబుల్ దునుమాడు దేవుడను ధా • త్రీభారముఁ దీర్చగా
యెపు డేరూపము దాల్పగావలయునో • యెవ్వాని శిక్షించితే

యుపరాగం బెలగల్గునో యెరిగి • సద్యుక్తిఁ బ్రవర్తించు వే
దవరుం డీపనిదీర్ప నన్ననుచు లో • దర్కించపకోయమ్మరో!॥ 11

మా——యీశివకేశవులే నాకు సహాయులై కార్యము నెరవేర్చెదరు నమ్ముము.

భూ——నాయనా యిప్పటికిఁబ్రతికితిని. సృష్టిస్థితిలయాధికారులగు మూర్తిత్రయం బేకీభవించిన కాని కార్యముండునా! (యీశ్వరునిజూచి) మహాత్మా నన్ననుగ్రహించి తమ రభయ హస్తము నిండు. బోయెద.

యీ——ధరాదేవీ!

ఉ॥ యేటికి సంశయంబు వగ • పేటికి దాల్పుము తాల్మి దైన్యమిం
కేటికి బొమ్మ నేన్విధి ధృ • తెంగరుడుండ దగునేడ్త నేడిదే
ధాటిగయుంచి నారసుఃము • దంబలరారత్వదీయ భారముం
సూటిగదీర్చుపూన్కి నిక • జూడుమిదే యభయంబు తల్లరో.

(అందరు నిష్క్రమింతురు తెర బడును.)

(నారద ప్రవేశము.)

మానినీవృత్తం

సాగరసంభవు సజ్జనకుండవు సంస్మరియించెద సత్యముగా
నా రునితంత్రిడివి మామకసద్మహిమప్రదనీయుడ మాధవనా
నేరములెన్నకు నిన్మదినమ్మెద నీరజలోచన నిక్కముగా
నిరసభావము నీకడలేదని నిన్నువలంతుము నీశ్వరులుఁ 13

(ఆలోచన నభినయించి) యేమిది నేరాదేచుకొన్నపుర మిదియే నాయెమి? అవును యెందుకుగాదు. యీపుర బహిరంగమున

ఉ॥ కాలభయంకరుండు విష • కంఠుడు రుద్రుడు దక్షయజ్ఞ శి
క్షాలంతాస్పదుండు యఘ • సంచయ దుర్గదవానలుండు గం
గాలహరీధరుండు దయ • గన్నసుతుండగు వీరభద్రు దే
వాలయమొండు గల్గెనని • వాసవుడుం వచియించె నాకటం.

మా——అదుగో ఆ అగుపడునదియే వీరభద్రాలయం. అటగల్గు చెట్ల నీడల బాలకులతో జతగూడి వీరభద్రుండును యువుతారవూరు

షుండగు బాలకుండును బట్టి గుడాడుచుండెరట. యోగమాయచే యదృశ్యా కారుండనై అటనిలచి వారియాటల నేత్రోత్సవ ముగా కొంత వీక్షించి యావల యవతార పురుషుండగు బాల కుని కొక్కనికే దర్శనమిచ్చి ఆగతానాగతము నెరుంగునట్లు గను, సమస్త విద్యా పారంగతుడౌనట్లుగను, దివ్యజ్ఞానము గల్గు నట్లుగను త్రివిక్రమ నాజ్ఞప్రకారము సమంత్రోపదేశము జేసెద. (నిష్క్రమించును.)

(వీరభద్రాలయము. వీరబ్రహ్మముగారు వేంకటరెడ్డి ప్రవేశము)

వేంక—మహాత్మా ప్రతిదినము మనతోగూడి

చం॥ విడువక యేకనాదముగ • భీతిఁ బాలురు బారునట్లు భ
ల్లుడుగుడుచెల్లుడోయనుచు • కూతనుగూయుచు నొక్కనొక్కనిన్
వడి వడి చెంగగొట్టి తను • బట్టగవచ్చిన వారినందరిన్
బుడమిని ద్రొళ్ళనెట్టి వడు • పున్ గని నేగెడువాని జెప్పవే.

బ్రహ్మ—చెలీ కాదా యామహానీయుని చరిత్రము నాకును గోచరము గాకయున్నది. (తనలో) ఆమహానీయునితో ప్రవల్లాట్టహాసమున వెనుదీయక బట్టిగుడాడి యీ రోజున వాని జన్మవృత్తాంతము గనిపెట్టెదను. (ప్రకాశముగా) యీరోజున బాలకులెవరూ ఆడు కొనుటకు రాకయుండి రేమికారణమై యుండునో.

వేంక—అయ్యా! యేల విచారించెదరు. ఆవేళకందరూ ప్రవేశించెదరు. ఆచెట్లనీడను విశ్రమింపుదము పద. (నిష్క్రమింతురు)

(నారదుడు ప్రవేశించి తనలో)

నా—ఈ రోజు నాకు సుదినంబుగానే యున్నది. అప్రయత్నంబుగా నాహారంబు లభించుచున్నయది. ఈ మరుగుననిల్చి వీక్షింపుచు యీ సమరాశనమును భుజించెదగాక. (తెరలోపలకేగి తిరిగివచ్చి) ఆహా వీరభద్రుండు మాయావేషముతో నొక బాలకుండయి కూత కూయుచు వచ్చినంతనే

మ॥ అరుగో బాలకులందరున్ బెదరు చా • హాకారముల్ చేయుచున్
బరువన్ జొచ్చిరి పోతులూర్వరవర • బ్రహ్మవతారుండ నా

దరణ౯ భద్రుని బట్టనిల్చె నిక శ్రీద్ధ న్భోరనుంకింతు కే
పరమానందముగాగనుంగొనిభుజం • వ౯ జూతుయుద్ధాన్నము౯.
(తెరలోపలి కేగి తిరిగివచ్చి ఆశ్చర్యముగా)

మ॥ వసుధాచక్రము దిద్దిరందిరుగ గ్రా • వ వ్రాతమల్లాడ సా
రస మిత్రుండును సారసారి రుచిరా • రంకార మొత్తంబుగా
య సువర్వ వ్రజము ప్లాటించవ యులసు • ప్తాంబోధుల౯ దిక౯ వృథా
విసంగ్రామము వీరభద్రుడు పర • బ్రహ్మంబానర్చు౯ బలే.
(వీరభద్రుడు తెరలో రౌద్రముగా)

మ॥ ననునోడించెడి శక్తి నీకు గలదా • నన్నట్ట నుంకింతువా
ఘనదోర్దర్పులె తల్లకిందయిరి వి • క౯ నాప్రతాపాగ్ని సే
వన నాకెంతటి బంటువాడు విష్ణుడై • వ్యాఘ్రైన సైదోడుగ
కొన యోచింపుము లేద తప్ప జనగ౯ • కూర్మిన్విలోకింపుమీ.

(అని తెరవెలుపలికి బ్ర॥ వీ॥ యుద్ధరూపత్తురు. నారదుడు లోపలి కేగును.)

బ్రహ్మ—(రోషముతో)

మ॥ ఘనదుర్వార పరాక్రమక్రమణ డా • క౯ నేడు గాఢయుద్ధయం
బున బంధించెద వాడుమింక వశిన౯ • బోద్రోచిబోగ౯ చే
జను లేకుంచిననన్ను వేడుకొను భీ • ష్మంబేల యుష్మన్ని కే
తనమార్గంబును బట్టజేసెదను భవ । ద్దర్పం బదర్పంబన౯.

(అని వీరభద్రుని కౌగిటపట్టుకొని నిల్చు) (వీరభద్రుడు కొంతసేపు పెనుగులాడి వదలించుకొని ఆశ్చర్యముతో వీరభద్రుడు).

సీ॥ అమరులతో యుద్ధ • మాచరించితిగాని
యీ మహాబలునకిం • కెవడుదీటు !
యక్షరాక్షసులతో • నాజిసల్పితిగాని ।
యీమహాబలునకిం • కెవడుదీటు ।
గరుడముఖ్యులతోను • మరమొనర్చితిగాని ।
యీమహాబలునకిం • కెవడుదీటు ।
మనుజసమరముల • నమరగాంచితిగాని
యీమహాబలునకిం • కెవడుదీటు ।

మూఘ్రాన తాంబూర • మ్రోత వెట్టుచునుండ
కరమందు తాళముల్ • ఖంగురనగ
చరణాల నృత్యంబు • సల్పుచు చెలరేగ
చిత్రంబుగాజడల్ • చెదరియాడ
చంకకమండల • మింకదండంబు ప్రే
లాడివాదాడిటో • రాడిపీడ॥
గీ॥ జింకచెర్మంబు మొలయందు • జెలగుచుండ
రామరామ హరేరామ • రామయనుచు
పాట బాడుచునుండెతా • పసియొవండు
వాని కడకేగి మ్రొక్కెద • వాంఛదీర 24
(అని వానికడకరిగి) తాపసవర్యా నమస్కారము (అని నమస్కరించును).
నా—(సుఖభవా వైవాహికసంపత్సౌభాగ్యప్రాప్తిరస్తు షట్శాస్త్రగ్రాహ్యసర్వసిద్ధిరస్తు. దివ్యజ్ఞానవైభోగావాప్తిరస్తుమహానుభావ సీవు మానవుండవుగావు త్రిమూర్త్యాంశంబునబ్రహ్మవతారంబు ధరించు పుణ్యపురుషుండవుగాని వేరుకాదు నీకు కన్నివిధంబుల జయం బాపాదించుగాక॥
బ్రహ్మ—ఓహో (తనలో) యీ మహానుభావుండు నా గురువరుండగు వీరభద్రుడు నచియించిన నారద రుషీశ్వరుండా యేమి (అని కొంచెము నిదానించి) (ప్రకాశముగా) నారద మునీంద్రా మీరు నన్ను దీవించుటలో వైవాహిక ప్రాప్తిరస్తు యని యంటిరి.
ఉ॥ పెండిలియాడినన్ సతికి • బడ్డల సోదర పోషణార్థము
ద్దండపు కార్యకర్మముల • దాగొనినందున స్వస్థచిత్తమే
యుండదు మోక్షమున్ గనుట • కుర్విలభింపదు ప్రాప్తమయ్యెడో
యుండెద బ్రహ్మచారినయి • యోముని సత్తమ యాజ్ఞనియ్యవే॥ 25
నా—అహా అదేమి యిట్లనుచుంటివి॥
మ॥ జనకుండా నలచక్రవర్తియు హరి • శ్చంద్రుండు రాముండును
రుడున్ గృష్ణుడు ధర్మరాజు మొదలౌ • రాజుల్వివాహంబులం
దినమోక్షంబునుజెందరై రెయుటుగా • దీరాజయోగంబుమిం

చిన యోగంబిలలేదు నమ్ము దృఢవ్రతా • శ్రేష్ఠ ప్రవర్తించినా॥ 26
మా—కావున దివ్యజ్ఞానము గలుగ రహస్యంబుగా నొక్కమంత్రంబుప
దేశముజేసెద. దానియణిమాద్యష్టశిద్ధులు మహాత్ములు లభించును
త్రిలోక విజయుండయ్యెదవు. సరస్వతియె నీవలె మానవావతా
రము దాల్చి యుత్తమాన్వయంబున జనించి గోవిందమ్మయను
నామంబుచే యెన్నిసంబంధములువచ్చినను నొల్లక నావలన నీప
విస్తారమంతయు విని నిన్నువివాహంబాడ నుద్యుక్తురాలయి యు
న్నది. (అవనికబడును. నిష్క్రమింతురు.)

ప్రథమాంకము సమాప్తి.



## ద్వితీయాంకము.

(పాముగరచి చచ్చిన వెంకటరెడ్డి యూతని తల్లిదండ్రులు
దుఃఖముతో కూర్చొని)

తల్లి—సీ॥ నాయనా యిట కేమి • చేయవచ్చితివయ్యొ
మాయ చావొసగూడె • మాకుమారా
తండ్రి— తండ్రి నీకీపాము • దాపరం బెట్లాయె
మాకు దిక్కెవరురా • మాకుమార
తల్లి— అల్లారుముద్దున • నానందమిడునీదు
చాకచక్యమదేది • రా కుమార
తండ్రి— గొంతెమ్మకోర్కెలై • గొమరొందె మాకోర్కె
లయ్యోయో యికయెట్లు • హాకుమార
తల్లి—గీ॥ ముద్దుముచ్చటలన్నియు • ముగియలేదు
తండ్రి— వయసుమీరియు వార్థక్య • వార్థిబడవు

తల్లి — కమలభవుడింతలోన న • కాలమృత్యు
తండ్రి — పాలబడజేసె నిర్దయ • పట్టినిన్ను.

(యింతలో యోగివేషమున బ్రహ్మముగారు ప్రవేశించి తనలో)

మ॥ ఇటనెవ్వారలో పేరెలుంగుసను సం • డ్రీ సాకుమారా సుతా
యటకెవ్వారలు బిడ్డవచ్చితివి నీ • యేపాటు కాటందెనో
మటుమాయంబుగ జచ్చినాడవని బేలమై యేడ్చుచున్నారల
క్కట యా బాలకు డెవ్వడెందులకు నై • కాలాహిచే జచ్చెనో.

(అని ముందునకు నడచును. వెంకటరెడ్డి తల్లిదండ్రులు దుఃఖముతో (బ్రహ్మముగారిని జూచి) అయ్యా! మీరు యీ అర్ధరాత్రి యిటకేల వంపితిరి.

మ॥ కలలోనైనను యీహితంబు మరువం • గాలేని విశ్వాసుడు
జ్వాలతేజుండురుకార్య నిర్వహణుడౌ దా • స శ్రేష్ఠుడయ్యాయ్యమీ
చే కాడాయహిబాధచే సమసె ర • క్షింపగ ప్రయత్నించి మా
కులముద్ధారణసేయుమీ చిరుత నూ • కుర్ పుత్రుడో బ్రహ్మమా.

(అని నమస్కరించి దుఃఖముతో నిలతురు.)

బ్రహ్మ — (ఆశ్చర్యముతో) ఆహా యేమి నా స్నేహితుండగు వేంకటరెడ్డికి పాము గరచుటయు మృతినొందుటయునా. యేటిమాటలు. మీరావలకు బొండు. (అని ధ్యానమభినయించి)

మ॥ అరిషడ్వర్గలతాసినై పరమ స • త్యాచారవాత్స్యుండనై
సరసస్వాంతత వీరభద్రునకు శి • ష్యశ్రేష్ఠునై ధారుణీ
నరముఖ్ దీర్ఘుడు వాడనై తపశ్శుం • భన్మంత్ర శిద్ధుండనై
గరిమక్ బచ్చితి లేచి రా సఖుడ వే • గన్ ప్రాణయుక్తుండవై.

(అని లేవదీయును.)

వేంకటరెడ్డి ఆహా ఎంతనిద్రబోయి లేచితినని లేచి బ్రహ్మముగారిని గాంచి నమస్కరించును. (నిష్క్రమింతురు అవనికపడును. తెర లేచును.)

(కందివనములో బ్రహ్మముగారు యోగాసనమున కూర్చొని యుండును. వేంకటరెడ్డి భయంబున వడకుచూ నిలచియుండును.)

బ్రహ్మ — (ధ్యానమభినయించి)

మ॥ అకటా దుర్మద పాపకర్మ యిటు గో • హత్యోగ్రపాపంబు వ్రా
రక పోనేరదు యేలజేసితివి గా • రంబేమిటన్ జేసి గా
మక పింఛారి కులోద్భవుండవయి గో • మాంసంబు భక్షింపవే
నకలంకాత్మత మాకుశిష్యుడవుగ • బ్రహ్మ పాపముల్ ద్రుంచగన్.

వేంక—అయ్యో చిత్తము.

బ్రహ్మ—మనమునాగోవును బ్రతికింపబోవుదము పద. (నిష్క్రమింతురు.)

వెంక—మహాప్రసాదము

(తెరపడును.)

(బ్రహ్మముగారొక్కచో ప్రవేశించి)

గీ॥ జారచోరుల కాహ్లాద చర్యగూర్చు
నెంచి యరుదెంచి నటినీ ప్ర • పంచమంతె
కమ్మియు పవలు దివిటీని • నిమ్మళముగ
నార్చు సంతమసంబు నా • యంత్రమయ్యె. 6

సూ—యీగ్రామమునకు జేరితి (యీయింట ముందరి తిన్నెపయి
నరుండెద. (అని కూర్చుండును.)

గోవిందమ్మగారు—ద్వారమీవలకువచ్చి బ్రహ్మముగారిని గాంచి నమ
స్కరించి లోపల కేగి తల్లిదండ్రులగాంచి ముగ్గురు నొగవెలుపల
కేతెంచినయెడుపరి.

గోవిందమ్మ—మా తల్లిదండ్రులారా యెన్నిసంబంధము లొచ్చినను
వల్లకమీమనంబులు కష్టపెట్టుచును యిన్నిదినంబులు గడపితి.
యిప్పుడు మనవాలవాకటగల తిన్నెపయిన

మ॥ శిరమందున్ కరమందు తాయితులు వా • సిన్ గల్గువాడున్ శుభా
కర కాషాయధరాంబరుండు వరరు • ద్రాక్షాదివేరుల్ శిరో
ధరమందున్ గలవాడు భస్మధరవ • క్త్రశ్రేష్ఠుడున్ హేపరా
త్పర శంభో యనువాడు నన్నువరియిం • పన్ వచ్చి కూర్చుండెనూ

సూ—కావున మీరతిత్వరితంబుగా జని యామహానుభావుని తోడ్తెచ్చి
నన్నిచ్చి పరిణయం బాచరింపుడు.

తల్లి—అమ్మాయి యెంత పిచ్చిదానవు.

ఉ॥ వాని పురంబెరుంగము ని • వాసమెరుంగము జ్ఞానియో యు
జ్ఞానియునో శాస్త్రియొ యశాస్త్రియొ సత్కులుఁడో కాఁడొ నీ
వే నిజముఁ గ్రహించి హృద • యేశ్వరు డంటివి పిచ్చితల్లిగో
కాని వరుఁ వరింతువె యి • కఁ జను కుక్కిరిమిక్కి రాడకన్ 8

ఇంద్రు—కుమార్తెను జూచి,

మ॥ ధనవంతుల్ కడురూపవంతు లుగుణా • ఢ్యావంతు లెందఱొ గానఁ
ఘనులై నోటికిఁ జేతికెంగిలి పడం • గా చీకు లేనట్టి వా
రనయంబుఁ నినుఁగాంక్ష సేయ యిటు లే • లా వ్యర్థ సన్యాసినిన్
గని గాంక్షించెదు చాలునమ్మ వినుమిం • కఁ నీకు చేదస్తనా॥ 9

గోవిందమ్మగారు... (కోపముతో)

ఉ॥ భావమునందు గొంకక న • భావత నీశ్వరు నిర్వికారు దు
ర్భావవనీదవానలు ప • రాత్పరు దిట్టెడరే వినాశకా
లే విపరీతబుద్ధి యని • లేదె యెరుంగరె యమ్మ గానుమో
దేవ యటంచుఁ మొక్కు డల • దేవుడు మిమ్ము క్షమించి బ్రోచెడున్

సురా— యిదుగో నాదృష్టాభిప్రాయము తేటతెల్లముగాఁ జెప్పెద వినుండు.

ఉ॥ మీరెను తల్లిదండ్రులకు • మీరెను బంధులకంచు నన్ను ని
స్సారము జేసి లోకులు య • సారత నెక్కన బల్కనిమ్ము నా
కోరిన భర్తనాకు సమ • కూరెను పెంకితయాడుదాన దై
త్యారిపదాబ్జమాన త్రిపు • రాసురమర్దను పాదమానవహా॥

(నిష్క్రమింతురు.)

(గోవిందమ్మగారు వక్కతే దుఃఖముతో కూర్చొని తనలో)

ఉ॥ నాతల్లిదండ్రులెంతయు ఘ • నంబుగ నిన్ననివచ్చి చేదు ప్రే
మాతిశయంబు జూపరని • యాగ్రహమందగబోకు నామనో
నీతనముఁ గ్రహించు నను • నీసతిగాఁగ వరించుమా యప
ఖ్యాతినడంచు మమ్ము కరు • ణాంబుధిమంచు పరావతారుడా॥ 12

(అని నమస్కరించి పైటచెఱుగు పరచుకొని శయనించును.)

బ్రహ్మ— యెదురుగా వచ్చి నిలచి,

మ॥ పరిశుద్ధాత్మవయై ననుఁ వర వర • బ్రహ్మావతారుండ నం

చరయుగ గల్గిన దానవై నను వివా • హంబాడు నాశక్తితో
గురిగా నిల్చిన దానవై దనరితే • గోవింద రానమ్మ మీా
తలిదండ్రాదులవీడి నేను జన వి • త్రం బందు యోచించితిన్॥ 13

(గోవిందమ్మగారు లేచి నమస్కరించి)

మా——స్వామీా మీాకన్న నాకిక్క డెవ్వ రాప్తులుండిరి. నేను మీా వెంటనే వచ్చుచుంటినిగాని నాతలిదండ్రాదుల వాచాదోష ముప సంహరించి రక్షింపవేడుచుంటిని.

బ్రహ్మ——మనోసుందరీ అటుల నాకోలది దినంబులలో వారు మనకు వివాహంబుజేయ మన నివాసంబున కేతెంతురు. అప్పుడు వారిని కరుణింతు. ఆవిషయములో విచారవడకుము. (తెరపడును.)
(నిష్క్రమింతురు.)

(యేకాంబర యోగి ప్రవేశము.)

మా—— ఆహా యీాకలికాలమెంత దురంతము గానున్నయది.

సీ॥ ఇతర సంపదగాంచి • యేడ్చుచుండెడివారు
పరనింద చాతుర్య • బరగువారు
యితరకష్టముగాంచి • యింపు జెందెడివారు
పరసతుగోన పాలు • బడెడివారు
కలహంబులను బెంచి • కడ కేగు వారలు
నమ్మించి కంఠముల్ • నరుకువారు
వావివరుసలు దప్పి • వర్తించువారలు
నన్యాయమార్గమం • దరుగువారు

గీ॥ యెంచ దానవచర్యల • మించువారు
సాధుజనులను నిందించు • సరణివారు
పుణ్యపూర్షుల బెదరించు • బూచివారు
గల్గి రీకలికాల వి • కారమందు. 14

మా—— యింకను.

సీ॥ యెవరైన నమితార్తి • నేతెంచి ప్రొక్కిన
కరములు గోయగా • గడగుచుంద్రు

యెవ్వరైన నన్నమిం • తేనిదుమనియన్న
శ్రీయు కముగ బెట్టి • జెలగుచుండ్రు
యెవ్వరైన హింసముగా • నివసించినంతనె
లంకమా జట్టుకు • శాయిగొంద్రదు
యెవ్వరైన సత్కార్య • మొనసల్పజెందిన
విఘ్నంబొనర్చి • వేటకనుండ్రు
గీ॥ నోరు మూర్చాడుచుండగా • నోసలువెక్కి
రించుచుండును నిజము వా • రించుకైన
ధర్మమనుమాట యెరుగక • ధర్మవృత్తి
బరిభవింపగ జేయుగ • ప్రౌఢియేమొ॥ 15

మా—యింకను దురాత్మలెన్నియో గలవు. లెక్కింప నలవి గాదు. కానిమ్ము. అందువలనే సురలోకంబున యేకదంతుండనైన నన్ను యీలోకంబున యేకాంబర నామంబుతో బ్రహ్మవతారునకు సహాయభూతుండనయి, చరింప శివకేశవులుబంపగా యోగివేషంబున యీ సాయంకాలమే యీ కందివనంబునయుంచెగని తెలిసి వచ్చితినిగాని యీమహానుభావుం డెటకేగెనో యగుపింగ రాకున్నయది. (అటునిటు పరికించి) అదిగో కందితడికలతో నిర్మింపబడిన పటనం బొకటి గాన్పించుచున్నయది వారు నివసించునది గాబోలు. అటకేగివీక్షించెద. (నిష్క్రమించును.)

(యేకాంబరయోగి ప్రవేశించి నిలచియుండగా నకవటుడు భయాక్రాంతంబున పరువుతో వచ్చి పాదములబట్టును.)

యేకాం—(లేవదీసి) నీవెవరు యెందువలన యింతభీతి జెందుచుంటివి జెప్పుము.

నటు—(దుఃఖముతో) అయ్యో నేనేమిచెప్పుదును. నోరెండుచున్నయది. మాట తడబడుచున్నయది. గుండెలదరుచున్నయవి. (అనిబెదరుచు దిక్కులజూచుచు) అయ్యో అయ్యో అదిగో అదిగో వచ్చుచున్నయది నన్నుమ్రింగును. సంహరింపును. సంహరింపును. నన్ను బ్రతుకనివ్వదు. (అని కౌగలించుకొనును)

యేకాం—యేలయింతభీతిజెందెదవు. అదియెవరో వచింపుము. సంహరించెద (అని యోగదండము ఝళిపించును)

వటు—అయ్యా అటులైన చెప్పెదవినుండు. మాపురంబునుండి యీావనంబున కావలగల పురంబునకు పౌరోహిత్యమునకు ప్రతిదినమూ పోవుచుండెడి మామూలు కలదు. అట్లు ప్రతిదినమూ పోవుచూ యీావనంబున నివసించు బ్రహ్మముగారికి ప్రతిరోజు పంచాంగము చెప్పుపద్ధతియూ గలదు. అటులనే యీారోజు వుదయమున యిట కువచ్చితి. ఆమహానుభావుని దర్శనములభింపదయ్యెను. కానిమ్ము తిరిగి వచ్చునప్పుడు దర్శింపవచ్చునులేయని పౌరోహిత గ్రామంబున కేగితి. ఆగ్రామంబునకు మిట్టమధ్యాన్నవేళ్ళ కొలిమి బెట్టి యినుము గరుగుచున్న యొకపురుషుని యొద్దకు బ్రహ్మముగారు వచ్చి దాహమిప్పింపమని వేడెనట.

యేకాం—(ఆశ్చర్యముతో) హా అతడు దాహమిప్పించెనా?

వటు—వినుండు అతండు అటగల జనులందరూ జూచుచుండ కొలిమిలో యినుము గరుగుచున్న మూసను కారుతో బట్టి,

యేకాం—(ఆతురముతో) ఆహాయేమది! ఆమూసను యేమిజేసెను?

వటు—యేమిజేసెనా. మీారుమహానుభావులు యివిగో దాహము త్రాగుడని ఆమూసనుచేతికిచ్చెను.

యేకాం—అయ్యో అంతనాపరాత్పరుడుడేమిజేసెను.

వటు—యేమిజేసెనా నీరునీరుగా కరిగిన యానుమంతయూ గటగటా త్రాగెను.

యేకాం—ఓహో యెంతపనిజరిగినది. అందువలన యామహానుభావున కేమైన బాధగల్గినదాయేమి?

వటు—వారికేమియూ బాధలేక విషము త్రావిన యీశ్వరుభంగి వెలింగిరిగాని అపహాస్యముగా దాహమిచ్చిన దురాత్మునకుమాత్రము గర్భమంతయూ కమలి ఆరాటంబున నేలంబడి తన్నుకొనసాగెను.

యేకాం—అరేదురాత్మా పెద్దల నపహాసించినసీదుగాగత మూారక పోవునా!

వటు॥ అంతట నాయన్యాపూరుషుండటనుండక జనుచుండ నటగలజనులం
దరూ హ స్తంబులెత్తి (మొక్కుచూ మహాత్మా మమ్ముబ్రోవవే
యని వేడుచూ వెంటబడ కనపడకుండా యెటోపోయెనట.

యేకాం—యిట దుష్టుడేమాయెను.

వటు—యమాలయగతుడాయెను.

యేకాం—(అట్టి దురాత్ముండు (బతుకునా) యిందునీభయమేమున్నది.

వటు—చెప్పెదవినుండు ఈచరిత్రమంతయూ వినునంతకే చీకటి పడెను.
భయపడక యీమార్గముంబట్టి వచ్చుచుండగా

సీ॥ మసిమంగలపుతీవి • హాసియించు మోముతో
పాచిబట్టిన పార • పండ్లతోడ
సంకెందనచాయ • నుంచు దేహంబుతో
నిడువగు తాడ్బెట్టు • పాదవుతోడ
కురిచయై చింపిరై • కరితెల్పు కురులతో
నోటితుంపర్లపై • న్నిటుతోడ
మిసిమిపాటుగలుంగ • మిడిగుడ్లు వడిద్రిప్పి
బ్రహ్మాండభాండముల్ • బగులనార్చి
గీ॥ ఆవ్రుర యొటకేగెదవు నిల్వు • మనుచు బ్రమంగ
వచ్చె దయ్యమొ భూతమొ • బ్రహ్మరాక్ష
సియో మరెద్దియో తెలియక • జేరినాడ
నన్ను రక్షింతురని మిమ్ము • నమ్మినాడ. 16

యేకాం—భయపడకుము. (అని భయముతో నిలచును. ఇదిగో దాని
భస్మీభూతమొనర్చెదనుఅని కంది మొల్ల నొకదాని బీకి)

సీ॥ ధాగుశీభార ని • వారణాఖ్యాయ బ్ర
హ్మవ తారాయ న • మశ్శివాయ
ధర్మకార్యాయ శాం • త స్వరూపాయ బ్ర
హ్మవతారాయ న • మశ్శివాయ
జంగమస్థావర • జంతుజాలాయ బ్ర
హ్మవతారాయ న • మశ్శివాయ

సజ్జనహృత్తాప • సంహారణాయ బ్ర
హ్మానతారాయ న • మశ్శివాయ
గీ॥ భూమిస్పృష్టిస్థితిహేతు • భూతాకార
ణాయ నిర్వికారాయ భ • వాయ ఓం న
మశ్శివాయ యీ మల్లె బ్ర • హ్మాస్త్రమగుచు
దాని వధియించుగాక నీ • దయనమేయ. 17

(అని అస్త్రమంత్రించి విడచును. సర్పము గాయింతొను. తెగబడును.)

(బ్రహ్మముగారు గోవిందమ్మగారు ప్రవేశింతురు. గోవిందమ్మగారి చెయ్యి బ్రహ్మముగారు పట్టుకొని.)

సీ॥ తరుణీమణీ నీవు • తల్లిదండ్రులను బాసి
ఒంటనాతోడ • నుండగలవె
యెండకన్నెరుగక • యెప్పుడు గృహమందు
యుండువే యటవి నీ • వుండగలవె.
చెలులతో జతగూడి • విలసిల్లుదాననీవి
కాంతార మృగముల • గాంచగలవె.
షడ్రసాన్నంబుల • సాపాడుదాననీవి
కందగుగ్గిళ్ళతో • ప్రమందగలవె.
గీ॥ బంధుగులలోన మెలగెడి • బాలవగుచు
భక్తవర్గంబు లోపల • బ్రబలగలవె
మేటి పాన్పున శయనించు • బోటివిట్లు
బండనేలల పైనను • బండగలవె.

గోవిందమ్మ—మనోహరా నావిషయమై ఇంత విచారమేల

సీ॥ సీతామహాదేవి • శ్రీరాముతో గూడి
వనవాసమును జేయ • వినగలేదా
దమయంతి నలునితో • దరలియు వనవాస
మును జేయు సంగతి • వినగలేదా
పాంచాలి పాండవ • ప్రకరంబుతో గూడి
వనవాసమును జేయ • వినగలేదా.

చంద్రమతియు హరి • శ్చంద్రుతో జతగూడి
వనవాసమును జేయ • వినగ లేదె
గీ॥ అల్ల సావిత్రి భర్తతో • నడవియందు
పడగరానట్టి యిడుముల • బడగ లేదె
నేను బడుటొప్పు టే మనో • నిర్వికార
తారకాధార బ్రహ్మవ • తారధీర.

(నమస్కరించును తెరబడును. నిష్క్రమింతురు)

(ఒక యోగి ప్రవేశించి అద్దము చూచుకొనుచు)

సీ. నున్నగా తలదువ్వి • వెన్నున దిగజార
పొడవైన వెంట్రుకల్ • విడచినాను
నవజాతి రుచిమీరు • వదనంబునను బొట్టు
తిరుచూర్ణమున నిల్వు • దీర్చినాను
కన్నులంబులను గేరు • కనులకు కాటుక
ప్రియమైన రీతిని • బెట్టినాను
కనకకాంతిని దనరు • కాయంబునను మంచి
కాషాయ చేలంబు • గట్టినాను
గీ॥ యోగదండంబు నొకచేత • నుంచినాను
యోకమండలు మీచంక • కేసినాను
చేతివ్రేళ్ళకు జపమాల • జేర్చినాను
అద్దమునజూచి యానంద • మందినాను॥ 20

యోగి— ఈ వేషమునబోయి యాపరబ్రహ్మవతారుని మనోధృఢ మెంతెగా పరీక్షించెద. (అని అటుపరికించి) అదుగో యెవరో తొండము లేని వినాయకునిగతి యొకభక్తుడిటు వచ్చుచున్నాడు. బ్రహ్మము గారెటయుండిరో వారినడిగి తెలసుకొనియెద.

యేకాంబర యోగి ప్రవేశము.

యోగి—అయ్యా బ్రహ్మము గారెటనుండిరి. యేమిచేయుచుండిరి.

యేకాం— సభామంటపమున భక్తకోటితో సంభాషించుచుండిరి.

యోగి—అట్లు కేళ్లూవుట్లకు వీలుండునా?

యేకాం—అభ్యంతరమేమి పోవచ్చును.
యోగి—అటులైన నీవు నన్నటకు దోడ్కొనిపోయెదవా?
యేకాం—నేను ఫలపత్రపుష్పములకు బోయి రావలయు.
యోగి—యెంతసేపటికి వచ్చెదవు?
యేకాం—త్వరగానే వచ్చెదను గాని నీవు ముందుబొమ్ము.
యోగి—చిత్తమటులనే. (నిష్క్రమింతురు)

(సభామంటపమున బ్రహ్మముగారు గోవిందమ్మగారు యింకా కొందరుభక్తులు కూర్చొనియుండగా యోగిప్రవేశించి (చేతులుజోడించి)

సీ॥ కామమోహారిషడ్వర్గ • గాఢాంధకార ప్ర
పంచంబు నడగించు • భానుతేజ
ప్రవిమలేష్టార్థ • సత్పదవినిగ్రకొన
నలరునర్థిజన క • ల్పావనీజ
జగతిని బహుజన్మ • సంచిత ప్రారబ్ధ
కర్మ గజమదాంత • క మృగరాజ
సదమల భక్తతో • జరియించుభక్తుల
భావ సామ్రాజ్యసుం • భద్బిడౌజ
గీ॥ వందనము జేతును మదీయ • వాంఛితంబు
దీర్చు శీతనిరీక్షణ • దివ్యమాన
సంబుతోడ మహాత్మ సం • సారసార
వాసనల గ్రహియింపగ • వచ్చినాను॥
(అని నమస్కరించి మారవికారముగా నిలచును.)

బ్రహ్మ—అటులనా (అని యొకచిత్రాసనముజూపి)

మ॥ నిమసంబిచ్చట విశ్రమింపుము భళీ • నీరూపురేఖావిలా
సముఁవీక్షింపగ నేగ్రహించితిని వే • సంబొక్కటీరయ్యో వా
క్యము లింకొక్కవిధంబులయ్యె యిక భా • వాచారమెట్లున్నదో
విమలాంగీ వేబుచ్చుమావల భవ • ద్వృత్తాంతమే జెప్పదగ. 22

యోగి—(తనలో) వోహో యీమహానుభావుడు దివ్యజ్ఞానముచే నా

తెరంగెరింగెనాయేమి. కానిమ్ము. (ప్రకాశముగా) మహాత్మా నేను వాక్యంబుల నొకరీతిగను వేషంబున మఱొక్క రీతిగను తమకు గనుపడుచుంటినా? అదెట్టులో వచింపుడు.

బ్రహ్మ—వాక్యంబుల భోగినివి. వేషంబున యోగినివి.

యోగి—అదెట్లు?

బ్రహ్మ— నీవు వయో ప్రాయమ్ము. సమస్తకామము లనుభవించవలసిన దానవై యీ యోగివేష మేలధరించితివి.

యోగి—వయోప్రాయులయిన తమరేల ధరించితిరో నేనట్లునే ధరించితిని.

బ్రహ్మ—అట్లయిన కామినివై యిట కేలవచ్చితివి.

యోగి—గోవిందమ్మగారికై మీరేలబోయితిరో నేనట్లునే వచ్చితిని.

బ్రహ్మ—కామరహితముగా

యోగి—కామరహితులెట్లయితిరి.

బ్రహ్మ—యేమి—

యోగి—యేమి కామరహితులా. కామరహితులకు వివాహమాడు మను సంకల్పమెట్లుండును? (సభాసదులవైపు దిరిగి) సభాసదులారా యీమహాత్రయమునకు వివాహమాడ నుద్యుక్తులగు వారు జితేంద్రియులెట్లగుదురో మీరైన బాగా విచారించి వచింపుడు.

(అందఱూ నిర్విరపక్షి చూచుచుందురు.)

బ్రహ్మ—ఓ యోగినీ నీవు పూర్వమున మోహినివై మోహాంధని త్రిజగంబుల నలంచుచూ భక్తిహీనుల జేయుచుండుటచే యీశ్వరుడాగ్రహించి నిన్ను శపింప వికారరూపివై నీజనకుండగు కమలాసనుకడకేగి తండ్రీ నాశాపంబెట్లుపాపెదవని ప్రార్థింప అతండు దయాపూర్ణ భావుండయి ముందు త్రిమూర్త్యాంశంబున భూలోకంబున యుత్తమాన్వయమున యేజనించి నందివనమున నివసించియుందురను. అటకు నీశ్వరపుత్రుండగు యేకదంతుండు యేకాంబర నామంబుతో యోగివేషంబున నాకు సహాయంబుగా

వచ్చును. నీవొకవటుని బ్రహ్మరాక్షసివై తరుముకొనివచ్చెదవు. అపుడా యేకాంబరయోగిని ఆశ్రయించును. నీసంహారమునకు బ్రహ్మ ప్రసాదను పంచాక్షరీ మంత్రంబున ఆతండు ప్రయోగించును. అందున నీశాపవిమోచనమగును. వటుని రక్షణముగా జరుగును. పొమ్ము అని దీవించుటవల్ల యిటకు వచ్చితివి. శాప విమోచన మాచరించుకొంటివి. నన్ను బరీక్షింప నిటకేతెంచితివి. యీవేషముతో నేమి ప్రయోజనము.

సీ॥ పంచాక్షరీధ్యాన • పరనానలంబుచే
పాపాటవులభస్మ • పరుచవలయు
పంచాక్షరీధ్యాన • పరనాసి వాడిచే
అరివర్గగజముల • నణచవలయు
పంచాక్షరీధ్యాన • పరసౌషధంబుచే
భవరోగములనెల్ల • బాపవలయు
పంచాక్షరీధ్యాన • పరనానిలంబుచే
సంతాపఘనమిడ • జరుచవలయు

గీ॥ నవ్య పంచాక్షరీ ధ్యాన • నావచేత
నగిన సంసారవార్ధిని • దాటవలయు
హృదయ సరసిజవాసిన్యై • యెసగు దేవు
జ్ఞాన మార్గంబుననుబోయి • గానవలయు.

మ॰—కావున నీవు తరుముకవచ్చిన వటుం డస్మదీయాగ్ర సుతుండయి జనించు. నీవు అతని పుత్రికవై జనించి నావలన మోక్షమార్గము గాంచు. (నిర్వికారత వహించును.)

(భక్తులంగరు చేతులు ముకుళించి నిలతురు.)

యోగిని— విత్తము.

సీ॥ భూదేవి భారంబు • బోజేయ బ్రహ్మవ
తారంబుయీరీతి • దాల్చియుండి
యుగ్రాస్మజాని కేళి • నొప్పించి మెప్పించి
ఆత్మబోధామృతం • బందియుండి

మహనీయ నారద • మంత్రోపదేశ ది
వ్యజ్ఞానపటిమచే • యలరియుండి
పాముచే జచ్చిన • బాలుకు బ్రతికించి
ప్రవిమలకీర్తిచే • బ్రబలి యుండి
గీ॥ శ్రీ సింగరగాడు యనుమిడ • కూర్మిద్రావి
నట్టిమార్కండేయించు మ • హత్వమున మ
దీయ శాపవిమోచన • మాయె కంద
మెల్లె నీస్తంభంబునను • మీ మహత్మ్య॥
(అని పాగంబుల గాలును.) (పౌరుడును. నిష్క్రమింతురు.)

ద్వితీయాంకము సంపూర్ణము.

# తృతీయాంకము.

(శిద్దడు ప్రవేసించి విచారముతో)

సీ॥ దానధర్మంబులు • దాను సల్పుట లేదు
నిమలశాస్త్రంబులు • వినుట లేదు
అర్ధిపూజలుసల్పు • ననువందికయె లేదు
న్యాయమర్గమూట యే • నాడు లేదు
మేలు సేయుట యుట్టి • కాలమందున లేదు
కనికరంబెట్టిదో • గాంచ లేదు
ఆర్తరక్షణబెరు • దండబూనుట లేదు
గౌరవంబొక్కింత • గనుట లేదు
గీ. ఓరు పేమియు స్వాంతమం • దుండ లేదు
జ్ఞానమార్గంబుననుబోవు • జ్ఞాత లేదు
గోవుమాంసంబు దినుమని • కూతలిడుదు
రెట్టి తల్లితండ్రులకడ • నెట్టులుందు॥
మా—హా పరాత్పరా యెచ్చటనైనను

కం॥ ధర మును తారక సాంఖ్యాల్
తిరముగ నమనస్కమవల • దెల్పియు నవలన్
పరిపూర్ణ బోధ జేసెడి
గురువరు నేడోకనినాకు • గూర్పవె తండ్రీ॥ 2

(అని నిష్క్రమించును.)

(మల్లయ్యగారు ప్రవేశించి సంతోషముగా)

ఆహా నాజన్మమెంత సాఫల్యమందినది. యీవుదయమున నన్ను బ్రహ్మముగారు పిలిపించి యీకందివనమును మాకిచ్చినయెడల నీపేరు కలశివచ్చునటుల కందిమల్లయ్యపల్లెయని నామంబిడి భక్తశ్రేణి నివసించుటకు యోగ్యంబయిన యొకచిన్నగ్రామంబు నిర్మించెదము. అందున నీ యశంబు సూర్యచంద్రాస్థాయిగా నిల్చును. అని వచింప నేను సమ్మతించి వారికరుణాపాత్రుండనయితి యిక.

గీ॥ నిశ్చయానంద పరిపూర్ణ • నిపుణుడైన
విశ్రుతయశుండు పోతులూ • రీరగురుడు
నాదు వాంఛితము లొసంగు • మోదమలర
మోక్షమార్గంబుజూపుచ • మోఘముగను॥ 3

(నిష్క్రమించును.)

(శిద్దడు ప్రవేసించి)

మా—హా జగద్రక్షకా

సీ॥ గడ్డముల్ దెగబెంచి • దొడ్డవాడనటంచు
దమ్మలాగెడిపాట • లాడువారు
కాషాయవస్త్రము ల్ • గట్టిగామొలజుట్టి
విటవృత్తి నెచ్చటో • వెలయువారు
రుద్రాక్షపేరుల • గూఢిగామెడదాల్చి
దుర్మార్గవర్తనన్ • దగుగువారు
యోగివేషంబునన్ • త్యాగముల్ వచియించి
యుదరపోషణకునై • యుండువారు
గీ॥ మాయవేషంబుతో చెడు • మరుగుపరచి

నిర్మలాత్ములమనిజెప్పి • నెగడువారు
గానబడుచుండిరిలను సు • జ్ఞానులెవరు
గానబడకుండిరి యెచ్చట • గల్గినారొ॥ 4
(నిష్క్రమించును.)

(బ్రహ్మముగారు, గోవిందమ్మగారు, యీశ్వరమ్మగారు, పోతులూరయ్యగారు, గోవిందయ్యగారు, యేకాంబరయోగిగారు, సభదీరియుందురు.)

బ్రహ్మ—(చేతులుజోడించి)

మ॥ వరకాయంబను కొండపైన • శిరమన్ బ్రహ్మాలయంబందు సు
స్థిరస్వాంతార్చకుతో రవిందులతో వా • సినాదు బిందుద్యుతో
సురగంగాత్రితయంబుతో హరిహర • బ్రహ్మాదులన్నిల్చు నిన్
నరియింపన్ పలుమారు హంస చో శే • వన్ వచ్చు విశ్వేశ్వరా॥ 5

(అని కొంచెముధ్యానమభినయించి) యేకాంబరయోగిని వీక్షించి

మా—యోగిసత్తమా

సీ॥ మొదటిమెట్టుననిల్చి • ముద్రలన్ బట్టుచు
నాదముల్ వినియెడు • నాకౌపరులు
రెండవమెట్టునం • దుండి చరాచర
వస్తువుల్ లెక్కించు • వాస్తవులును
మూడవమెట్టుపై • ముదమున వసియింపు
చాశివజీవైక్య • మందుఘనులు
నాల్గవమెట్టుపై • దొలక కూర్చుండి
బ్రహ్మము నేనంచు • బలుకు విమలు
గీ॥ అద్వితీయమహంబ్రహ్మ • మనెడి నిర్వి
కార నిశ్చల నిర్మల • కారణాత్మ
సచ్చిదానంద పరమహం • సలగుయోగి
వరులువచ్చిరే యీసభా • భవనమునకు॥ 6

యేకాం—చిత్తము.

సీ॥ ఋగ్వేదమునజూచి • రూఢిగాప్రజ్ఞాన
బ్రహ్మంబు నెరిగిన • ప్రౌఢులిరుగా

తైత్తిరీయోప ని • షత్తునఁ బ్రతిఅహం
బ్రహ్మాస్మినాదగు • ప్రౌఢులరుగో
సామవేదము నందు • నగిన తత్త్వమసివా
క్యంబునెరింగిన • కర్తలిరుగో
యాయథర్వణవెడ • మందయమాత్మ బ్ర
హ్మంబు నాలోకించు • మాన్యులరుగో
గీ॥ యటు మహోపనిషత్తునం • దనరునట్టి
సర్వముఖ్ ఖల్విదం బ్రహ్మ • మూర్తి యనెడు
వాక్య మెరిగిచరించెడి • వారలరుగో
యందరుం జేరి యీసభా • మందిరమున॥

బ్రహ్మ — అటులనా.

సీ॥ అతిథియభ్యాగతు • లరుదెంచు చున్నారె
భూరి సంతోషమే • వారి కచట
సంశయస్వాంతులు • జనుదెంచుచున్నారె
కోరికల్ దీరునె • వారికచట
వరయోగు లెవ్వరైన • బరతెంచుచున్నారె
బరిచర్య లొప్పునే • వారి కచట
మతివాదులత్యుగ్ర • మతివచ్చుచున్నారె
వరమతిగల్గునే • వారి కిచట
గీ॥ పూర్వపుణ్యంబు మంచిదై • పొసగుకతన
జ్ఞానమార్గంబు గాంచెడి • ధ్యానమబ్బి
మనదు సన్నిధికరుదెంచు • మాన్యు లెవ్వ
రైన నిలువయున్నారె యే • కాంబరాఖ్య॥

(శిద్దడు ప్రవేశించి)

మా — బ్రహ్మముగారిని జూచి, (నేతులు జోడించి)

మ॥ కలయఁ జూచితి దేశమంతయును రో • గజ్ఞాను డెచ్చోట ని
ర్మలభావంబున గానుపింపడయె బ్ర • హ్మజ్ఞానమార్గోత్తమా
చలతత్త్వప్రభుగా నెరింగి నిను గాం • చన్వచ్చినాడఁ బ్రయా
సలకీనోర్చియు సత్కరింపుము స్వహ • ర్చంచత్వరబ్రహ్మమా॥

బ్రహ్మ—బాలకా నాపాపములంటుటకు

సీ॥ సుందు ధరేషణల్ • మొదలంటగా ద్రుంచ
మొలగెడు వాడుగా • వలెను సుమ్మి
యూపైని దారేష • ణాద్యంతము న ద్రుంచ
జెలగెడు వాడుగా • వలెను సుమ్మి
యటుపైని పుత్రేష • ణాసాంతముగ ద్రుంచ
దనరెడు వాడుగా • వలెను సుమ్మి
శ్రమకోర్చి నశి రజ • స్సత్వతమోగుణం
బులద్రుంచువాడుగా • వలెను సుమ్మి
గీ॥ అట్టివాడవుగావు నీ • వర్భకుడవు
తల్లిదండ్రాదు లాజ్ఞల • దవిలినట్టి
వాడ వాత్మార్థ బోధకై • వచ్చితేడ
వీడు మదీయపదంబు లో • వైరివాడ॥ 10

(అని లేవదీయబోవును.)

శిద్ధ—మహాత్మా!

మ॥ స్థిరచిత్తంబున యీషణాత్రితయమూ • దిక్ ద్రుంచి యున్నాడ నా
యరిషడ్వర్గమడంచినాడ నటుపై • యాత్మార్థసారా దెల్ప మీ
దరికేతెంచినవాడ నిశ్చలుడ నా • తల్లిదండ్రులున్ మీరె మీ
చరణంబుల్ విడనాడ నిక్కముగ నో • సాక్షాత్పరబ్రహ్మమా॥ 11

(పోతులూరయగారు రౌద్రముగా)

మా—అవురా.

మ॥ కులమున్ దెల్పవు మమ్ము జూడవు పరో • క్షంబల్కుచున్నావు న
వ్వులుగావింక త్వదీయనామము కులం • బున్ తల్లిదండ్రానుగ
దేయంబల్కుము పాదముల్ విడుము లే • దే బుద్ధి యెన్నన్న చం
చలయాత్మార్థమటన్న స్వల్పమని నీ • స్వాంతంబునన్ యెంచితే॥ 12

(అని శిద్దసి మీదికిబోయి ఆవలకు లాగును.)

(శిద్దడు లేచి పోతులూరయగారికి నమస్కరించి)

మా—అయ్యా నాపయియింతి ఆగ్రహమేల జూపెదరు.

మ॥ ముదుమాలన్ వసియించువాడ కులమే • మోయన్న పింజారి వం
శ్యుడనాదంబెయు పీరుసాహెబు యశ • స్కుల్ తల్లిదండ్రుల్ ధృఢా
త్ముడ నానామము శిద్దడందురు మహా • త్మా నాకు యాత్మార్థమే
ర్పడ బోధించెడి వారలన్నమతి మీ • పాదాబ్జముల్ బట్టితిన్॥ 13

బ్రహ్మ — కుమారా యింతయాగ్రహం బేటికి (అటుకూర్చుండుము.)

మ॥ కులమేదైనను నేమి సత్కులుశీలున్ • గ్రూరత్ముడై గ్రాలడే
కులహీనుండు బుధానువర్తియయి స • ద్గోష్ఠిన్ బ్రవర్తిల్లడే
యుందుష్కర్మ మహాబలప్రళయతా • పాపౌగజంఝానిలా
మలనాత్మార్థ మెరుంగవచ్చు నతనిన్ • మన్నింపగా జెల్లదే॥ 14

శిద్ద — గురుప్రభో (చేతులు జోడించి)

ఉ॥ నిర్మల మానసుండవు వి • నీతిపరుండవు ఘోరకిల్బిషా
ధర్మవనానలుండవు య • థార్థవచుండవు సేవ దేవ స
ద్ధర్మఘృణాపూరిత ని • తాంతదయాళుడ హావరాత్పరా
నర్మిలి మ్రొక్కుచుంటి యుగు • ణప్రద బ్రహ్మము జిక్కజేయవే॥ 15

బ్రహ్మ — బాలకా యెంతపిచ్చివాడవు. నిర్గుణబ్రహ్మము జిక్కజేయుటకు
యెవ్వనిసాధ్యము. ఆపని స్వల్పమనుకొంటివా॥

ఉ॥ చిక్కడు సర్వశాస్త్ర పరి • శీలన సల్పిన యుక్తికేనియున్
చిక్కడు వేషధారులయి • చీయనచర్చలు సల్పుచున్న వే
జిక్కను బ్రహ్మమా హృదయ • సీమను భక్తిరసంబు జూపినన్
నిక్కము శిద్దడా నీయఘ్ను • ణీవ్రతశుద్ధుడ సుప్రసిద్ధుడా॥ 16

గోవిందయ్య — (లేచి) బ్రహ్మముగారితో

శా॥ ఓహో వీరు మహమ్మదీయులట నీ • వోతండ్రి తత్వార్థమున్
బాహాటంబుగ బోధజేయకులజుల్ • బాగోగులేమందురో
మోహోద్రేకత తల్లిదండ్రు లిటులా • మోదింపరో యేమొకో
నాహార వ్యవహారభారములలో • నాప్తత్వమున్ జూతురే॥

మా — కావున వీని తల్లిదండ్రుల యభిప్రాయము దెలియునంతకు కారణ
మివ్వకుము. (శిద్దడు గోవిందయ్యగారిని జూచి)

మా — స్వామీ నా మనోనిశ్చయము త్రికరణశుద్ధిగా దెల్పెదవినుండు.

మ॥ కులజుల్ భేదము జేయ పాటుబడ నీ • కోపానలోదగ్రులై
తీరె దంద్రుల్ బహుగా వివాదపడ నీ • తెన్వ్వండనీ బోవనీ
కరకంఠ భృకుటీ నిరీక్షణ మహా • గ్ర జ్వాల చల్లారనీ
జటియింపక సమసన్నిధిక నిలుతు భా • స్వద్బ్రహ్మ బోధార్థినై॥ 18

(పీరుసాహెబు ఆడంబి ప్రవేసింతురు)

పీ—(కుమారునిజూచి) అరే సమాషగాయున్నావురా

సీ॥ రుద్రాక్షలెన్ని యో • ముద్రశుద్ధిగదాల్చి
వెలయ మహాత్మ్మదీ • యులముగాదా
విభూతిధరియించి • విప్రవీగుచు నిట్టు
వెలయ మహాత్మ్మదీ • యులముగాదా
దండకమండలు • ధారియై సాములక
గొలువ మహాత్మ్మదీ • యులముగాదా
కాషాయ చేలముల్ • కట్టిగా మొలజుట్టి
గొలుక మహాత్మ్మదీ • యులముగాదా
గీ॥ మనకు మక్కా మసీదు సీ • మహిని బెక్కు
లుండ మతవిరుద్ధముగ ని • టుండనేల
మనకు అల్లాయనే దేవు • డనువునుండ
యితర దేవుల గొల్చుట • నేటికయ్య॥ 19

మా—అదియును గాక

చం॥ మన కులమందులేని మహి • మ్మపదులెందరో యేటి మహా
త్ముని కడజేరినావు కుల • ముఖ్యులు నిన్వ్యధబట్టజూతురో
తనయ మహాత్మ్మదీయులము • తంబున నైనను మొంత పెద్ద దే
వుని గనుచుందురో వెలయ • నొవ్వగపోదము రమ్మురమ్మికక॥ 20

శిద్ద—తండ్రీ యేమంటివి

చం॥ ఒకయెడ పెద్దదేవుడు మ • రొక్కయెడక కడుచిన్న దేవుడే
టికి వసియించు నింకే నిబ • డీకృతుడై సమస్త వసించు తా
నొకడది యప్రమత్తుల య • యోగనలేక మతానువర్తులై
ప్రకటిత ప్రజ్ఞజూపెదరు • పంతము లాడుచు రాను పోవ్విక 21

పోతులూరయ—(రౌద్రముతో) అరే బాలకా

మ॥ క్రమముగా తండ్రియువచ్చి రమ్మనిన బో • కన్ నిల్చుచున్నావు దు
ర్దమదోర్దర్పము ప్రతాప రిపు సం • రంభాటవీ పావ కో
ద్యమకాంక్షే యక బద్ది చూడు నిను సం • హారంబు గావింతవ
స్యము పోపొమ్మిక యేరికేని నవలో • క్యం బార్యమార్గంబనన్॥ 22

(అని కత్తి తీసుకొని ఝళిపించును) మీదికివచ్చును.

సిద్ద—(చేతులు జోడించి) అయ్యా! త్వర చేయుము నిరసింపకుడు.

మ॥ పరలోకంబున కెప్పుడైన జను ప్రా • ప్తంబుండు నీ కాయముల్
తిరమై యొప్పవు బుద్బుదంబు హహా • దేదీప్యమాన ప్రభా
కరవాలంబున యుద్ధరింపు శిరమున • త్కరంబు మీ సన్నిధిన్
స్థిర భావంబున నిల్పుచుంటిని మహా • సిద్ధుండ నే నిప్పుడే॥ 23

(అని ముందుకుబోయి వంగినిలుచును) పోతులూరయ
వెనుకకుబోయి తన పీఠముపై గూర్చుండును.

ఆడంబి—కుమారుని కౌగిలించుకొని దుఃఖముతో

సీ॥ ఎన్నోనోములనోచి • నిన్ను గంటిమి మున్ను
కన్నులజూడరా • చిన్ని పుత్ర

సిద్ద—యెందరి గర్భాల • నేబుట్టినాడనో
యెందరికన్నుల • గందునమ్మ

తల్లి—కన్నందులకు నమ్మ • కడ తేర్చ వేమిరా
కాఠిన్యమాయెంత • కన్నపుత్ర

సిద్ద—కన్నవారలనెల్ల • కడ తేర్చినాన నే
కాయముల్ స్థిరములై • గ్రాలునమ్మ

తల్లి— గీ॥ మన కులాచార దేవుని • మానసమున
దలవకింకొకని దలవ • దగునె పుత్ర

సిద్ద— మతములెన్నైన దేవుడే • మ్మహిని నొకఁ
డనెడి యార్యవాక్యముల్ • వినవె తల్లి॥ 24

తల్లి మాట—అయ్యో! కుమార నేనెంత వేడిననూ, నామాటవినక పెడ
మార్గంబున బోవుచుంటివా?

శిద్ధ—యేమది మోక్షమార్గమునబోవుట పెడమార్గమా?
తల్లి—ముమ్మాటికీ మామాట వినుటయే లేద?
శిద్ధ—ఆ ముమ్మాటికీ వినుటయే లేదు.
ఆదం—(భర్తను జూచి)
మ॥ మనమాటల్ చెవిబెట్టడయ్యె యెవరీ • మార్గంబు జూపించిరో
ఘనదీక్షాపరతంత్రుడై నిలిచె నా • కర్మంబయిట్లుండె యే
మనుదానన్ యికనేమిసేయుదును యేమాటల్ ప్రవర్తింతు హా
తనయున్ బాసి ప్రపంచమందకట నా • ధా నాకు దిక్కెవ్వరిక॥　　25
వీర—కాంతామణీ యేల దుఃఖించెదవు.
కం॥ మనపుత్రుడు గాడీతడు
మనపుత్రుడైయున యెడల • మనగతి జనడే
మనమాటవినడె మన్నన
గనడే పోషించడే శు • భంబు నొసగడే॥　　26
మా—కావున వీనిపై నాసవదలి ధైర్యమవలంబించి వీనికి వప్పజెప్పి
బోవుటే యుచితము (అని బ్రహ్మముగారిని జూచి) (శిద్ధని
చెయ్యి బట్టుకొని)
కం॥ మాపుత్రుడు గాడితడు
మీపుత్రుడెసుమ్మి యిపుడు • మీకడ జేరన్
యీపాపని రక్షింపరె
యేపాపమెరుంగడయ్య • యింగితవేద్యా॥　　27
(అని దుఃఖముతో శిద్ధని బ్రహ్మముగారి వద్ద గూర్చుండబెట్టి
నమస్కరించును)
గోవిందమ్మగారు—బాలకా నీతలిదండ్రులు యింత ఘోషింపుచుండ యిట
నుండ భావ్యముగాదు పొమ్ము.
శిద్ధ—జననీ మంచి మార్గంబునబోవు కుమారునిగాంచి సంతోషింపక
ఘోషించెదు జననీజనకుల వెంటబోవు టుచితమా.
(ఆదంబి - వీరుసాహెబు - నిష్క్రమింతురు)
బ్రహ్మముగారు—యీశ్వరమ్మగారినిజూచి, మనమరాలా!

ఉ॥ ఈతని పూర్వజన్మఫల • మోతని చిన్నతనాననాగమా
తీతవిచారణామలమ • తీవ్రతగాఁగ నొనర్చె శేనిచొ
యీతనికిట్టి నిశ్చలమ • దెట్టులగల్గును చూడుమమ్మ యిం
కీతనికాత్మబోధ వివరింపఁగ సందియమేలయుండెడిన్. 28

యీశ్వ—(లేచి బ్రహ్మముగారికి నమస్కరించి) జేజినాయనగారూ.

మ॥ పదిరెండేడులు సన్నిధిన్ నిలచి భవ్యంబైన శుశ్రూషచే
మదిరంజిల్లగజేసి సద్గురుని సమ్మానంబునన్ గాంచు వా
త్సదనన్ శిష్యునిగా గ్రహించవలె స్వేచ్ఛంబైన యాత్మార్థమున్
విదలింపన్ వలె బోధజేయవలెగా । వింపన్ వలెన్ మోక్షునిన్॥ 29

శిద్ద—(యీశ్వరమ్మగారికి నమస్కరించి) త్రిలోకాధీశ్వరియీశ్వరీ.

మ॥ తనువుల్ శాశ్వతమేమిగావు గడువిం • తన్ లేదు యేవేళనో
గనుమూయున్ పదిరెండువత్సరములిం • కన్ యెట్లు మీసన్నిధిన్
ఘనతత్వార్థముకై వసించుటలు శం • కల్మాని మోక్షార్థమున్
తనువున్నప్పుడె గాంచగావలయుగా • దాతల్లి వేజెప్పవే॥ 30

యీ—వత్సా అవును నిజమే (అని కొంచెము ధ్యానించి) శిద్దని
బ్రహ్మముగారికి జూపుచూ) యీతడు పూర్వజన్మలో

ఉ॥ గోవధజేసినాడు తమ • కూర్మిని జన్మకువచ్చినాడు దు
ర్భావముమానినాడు తలు • పన్ దశదండ్రుల బాసినాడు మీ
సేవయొనర్పగాయిటకు • జేరెను శిద్దడు సాత్వికుండు స
ద్భావుడు కారణంబిడుడు • భావముగాంచితి జేజినాయనా॥ 31

1 బ్రహ్మముగారు 2 శిద్దడు 3 యీశ్వరమ్మగారు 4 గోవిందమ్మ
గారు నిలచి తక్కినవారు నిష్క్రమింతురు)

శిద్ద—(బ్రహ్మనుజూచి) అయ్యా గుర్వారా,

చం॥ జగతి సముద్రభంగముల • చాడ్పున కర్మను యెల్లజీవులున్
దగజనియించి పెంపుగని • తాము నసింపుచునుండు నెట్టులీ
తగనివిధంబు బాయుక్రమ • దంబున దెల్పవె విన్నయుంతినా
కగణితమైన జన్మరహి • తాద్భుత మబ్బెడిదేమొ జెప్పరన్॥ 32

బ్రహ్మ—అమ్మాయి మనమరాలా యీశిద్దడు కర్మనసించి జన్మరాహి

త్వ్యడగుటకు సాధనంబుండిన దెల్పుమని ప్రార్థింపుచున్నవాడు.
అతని కాసాధనంబేదియో దెల్పగలవా

యా—జేజ నాయనగారు తమ రాజ్ఞయిచ్చిన యెడల యెందుకు జెప్ప జాలను

బ్రహ్మ—ఆజ్ఞనిచ్చితి వచింపుము

యాశ్వ—చిత్తము

గీ॥ ఆశ్రమంబుల నైదైన • యభ్యసించి
సాధనచతుష్టయంబరసి • సంగ్రహించి
శమదమాది షట్కసమితి • క్రమమెరుగుట
జన్మరాహిత్యమునకదే • సాధనంబు॥ 33

శిద్ద—(చేతులుజోడించి) అన్నా ఆశ్రమములెన్నియో తెలుపవ్వగలవా?

యాశ్వ—ఆ అటులనే, బ్రహ్మవంశము, బ్రహ్మచర్యము, గృహస్థము. వానప్రస్థము, సన్యాసము, అను అయిదాశ్రమములు గలవు.

శిద్ద—తల్లీ యేయాశ్రమమందు యెట్లు వర్తించవలయునో తెలుపుమ్ము.

యాశ్వ—శిద్దా అటులనే వచింతు వినుము. పిత్రోపదేశంబున

గీ॥ బ్రహ్మవంశజుడేరోజు • బ్రౌఢితోడ
నుదయమందున స్నానమిం • పొప్పజేసి
భస్మధారణ గాయత్రి • పఠనజేసి
బ్రహ్మసాక్షిత్వపదవినిక • బ్రబలగాంచు॥ 34

శిద్ద—తల్లీ బ్రహ్మచర్యాశ్రమ మెట్టిదో వచింపుము.

యాశ్వ—శిద్దా ఈవిషయము మాజేజినాయనగారినడుగుము.

శిద్ద—(బ్రహ్మముగారినిజూచి) స్వామీ యీ యాశ్రమమును తాము దెల్పుడు.

బ్రహ్మ—శిద్దా వినుము. గురూపదేశంబున

గీ॥ బ్రహ్మచర్యాశ్రముడుసదా • భైక్షమడగి
నిత్యముగ స్నానసంధ్యల • గ్నికుశ భస్మ
దండకౌపీన గాయత్రి • ధర్మవిధుల
దనరి సాలోక్యపదవిచే • ఘనతగాంచు॥ 35

శిష్య—స్వామీ గృహస్థాశ్రమధర్మ మెఱింగించెదరా?
బ్రహ్మ—శిష్యా వచింపకేమి గురూపదేశంబున
గీ॥ జపము భస్మంబు హోమంబు • స్నానసంధ్య
దేవపూజయు నతిథిపూ • జావిధాన
ముల ననుదినంబుగార్హస్థ్యు • డలరుచుండి
జగతి సామీప్యపదవిని • సంగ్రహించు॥ 36

శిష్య— మహాత్మా వానప్రస్థాశ్రమియుండెట్లు వర్తించును.
బ్రహ్మ—శిష్యా వినుము. తత్త్వమస్యాది మహావాక్యార్థాను భవము
గురునిచే పొందబడి
గీ॥ వయసుమీరిన తదుపరి • భార్యతోడ
నడవికేగి వానప్రస్థు • డనుదినంబు
స్నానసంధ్యాగ్నిహోత్ర భ • స్మము జరిపి
కందమూలఫలంబుల • గదసి దినుచు
బ్రహ్మసారూప్యపదవిని • బరిఢవిల్లు॥ 37

శిష్య—మహానుభావా యత్యాశ్రమిని నెఱుంగ జెప్పుడు,
బ్రహ్మ—శిష్యా వినుము గురుమూర్తి వలన.
సీ॥ నిత్యంబు స్నానంబు • నీరంబుగా సల్పి
భస్మధారణతోడ • బరిఢవిల్లి
తత్త్వభేదాభేద • తర్కంబు కర్మ దు
ష్కర్మముల త్రయా • ధర్మమణచి
పాశబంధంబుల • ప్రౌఢిచే దెగద్రెంచి
బంచేంద్రియంబుల • శౌరదోః
దేహాభిమానంబు • దివ్యంబుగా ద్రుంచి
నంటుస లేక తా • నంటుబడక
గీ॥ శుద్ధచైతన్యుడై ధర్మ • బద్ధుడగుచు
నామరూపక్రియాస్పద • మేమిగాక
తాను తానైన సన్న్యాసి • తనువువిడచి
బ్రహ్మసాయుజ్యపదవిని • బడయుచుండు॥ 38

శిద్ద—అమ్మా! రాజయోగానందబ్రహ్మమా? పరబ్రహ్మమా?

గీ॥ దివ్యపంచాశ్రమంబులఁ • దెలసినాడ
సాధనచతుష్టయంబును • బోధజేయ
వేడుచున్నాడ దెల్పవే • విశ్రుతాత్మ
తత్వనిశ్చయానంద వి • ధానమూన॥ 39

బ్రహ్మ-- అమ్మా యీసాధనచతుష్టయము లెవ్వియో వీనికబోధింపుము.

యా—చిత్తము (అని శిద్దనిజూచి) శిద్దా నిత్యానిత్య వస్తువివేకమనియు, యిహాముత్రార్థ ఫలభోగవిరాగమనియు, శమాదిషట్కసంపత్తి యనియు, ముముక్షుత్వమనియు నాలుగువిధంబులతో సాధన చతుష్టయమయ్యెను.

శిద్ద—తల్లీ వాటివిధము కొంచెమువచింపుము.

యా—శిద్దా బ్రహ్మము నిత్యమని జగమ నిత్యమని దెలియుటె నిత్యానిత్య వస్తు వివేకము. నరదేవలోకాంగనాదిభోగేచ్ఛను వదలుటె యిహాముత్రార్థ ఫలభోగ విరాగము.

శిద్ద—శమదమాది షట్కసంపత్తెట్టిదియో తెలియబలుకుము.

యా—శిద్దా యీసంగతి మాజేజినాయనగారి నడుగుము.

శిద్ద—తండ్రీ తాముపచింపుడు.

బ్రహ్మ—శిద్దా మీతల్లిగారు బోధించును. (గోవిందమ్మగారినిచూచి) యీవిషయమిూతనిక బోధించుము.

గోవిందమ్మ—స్వామీ తమరనుజ్ఞ నిచ్చినయెడల అటులనేబోధించెదను.

బ్రహ్మ——అనుజ్ఞనిచ్చితిని బోధింపుము.

గోవిందమ్మ—శిద్దా శమము - దమము - వుపరతి - తితీక్ష - సమాధానము - శ్రద్ధ అను నీయారు విధంబులతో శమాది షట్కసంపత్తి యయ్యెను.

ద్ద—జననీ వాటి విశేషము తెరుంగజెప్పుము.

గోవిందమ్మ—శిద్దా అటులనేజెప్పెదవినుము

గీ॥ అరయ విషయాదులను జిక్క • కాత్మనిర్మ
లంబుగవసింపజేయు శ • మంబటంద్రు

జ్ఞానకర్మేంద్రియంబు • లజ్ఞానకీ
ప్రమగ్నసీయక నిల్పద • మంటండ్రు॥ 40

శిద్ధ—తల్లీ తక్కిన విషయంబులు దెల్పుము

గోవింద—శిద్ధా

గీ॥ విహితకర్మలమంచిగా • విడచియుండు
టరయ నుపరతియనియెద • రార్యజనులు
యవనిసంచిత ప్రారబ్ధ • మైన కష్ట
మితరులకు నింద నిడకుంట • యోతితిక్ష॥ 41

శిద్ధ—జననీ తక్కినవి వచింపుము.

గోవింద—కుమారా అటులనే

గీ॥ తత్త్వబోధను వినుటకు • దగిలిరాని
మనమును మరల్పి గురుబోధ • వినెడుగతిని
జేయుటే సమాధానమై • జెల్వొసంగు
చిత్తశుద్ధియార్యనుతి ప్ర • సిద్ధ శిద్ధ॥ 42

శిద్ధ—తల్లీ శ్రద్ధాలక్షణముకూడా దెల్పుము.

గోవింద—అటులనే

గీ॥ తల్లిదండ్రుల గురువుల • దైవమందు
ప్రీతినిల్పుట శ్రద్ధ నం • ప్రీతివినుము
నిశ్చయమనంబుతో నెప్డు • నిలచి గురుని
బోధగాంచ ముముక్షుత్వ • పూర్ణమండ్రు॥ 43

(అవనికపడును.)

(అందరూ నిష్క్రమింతురు.)

తృతీయాంకము సంపూర్ణము.

# చతుర్థాంకము.

పోతులూరయ ఒక్కడే ప్రవేశించి

(రౌద్రముతో తనలో)

మ॥ అలచుక్కల్ ధరరాలఁడుల్చెదను భూ • పుష్యాకాశముల్ రెండు చే
తులతోఁ దాలిచి తాళమేతుదగ న • త్యుగ్రానల జ్వాల శీ
తలముఁ జేసెద మచ్చు చూపెదను స • ప్తద్వీప విశ్వంభరా
వలయంబందున గల్గు దుష్టులను మ • ద్వ్యాపార ప్రతాపోద్ధతిన్॥ 1

కు—యిట్టికుమారుండనైన నేను తమకడ కరుదెంచి

మ॥ అనువర్తిన్ నిను నాశ్రయించి మదభీ • ష్టార్థంబు సత్యార్థమో
జనకా బోధను సల్పవేయనిన న • ప్పుత్ర్రీతిని దీర్పక
న్వసిరో కారణమివ్వఁబూనుటలు భ • వ్యంబె నాకుం బ్రేయి దే
జని మాతండ్రిక మీస్వభావమును నాసాంతంబుగా దెల్పెదన్. 2

(నిష్క్రమించును అవనికపడును.)

(తెరదీయగనే బ్రహ్మముగారు కూర్చొనియుండగా, పోతులు జోడించియుండగా శిద్దడు నిల్చియుండవలెను.)

శిద్ద—అయ్యా సమాసంకారము గావ్రాజసత్ప్రీతిని

కం॥ ద్వాదశ వందనముల చేకడు
మొదముతో సల్పితిని మ • ముక్షార్థా
స్వాదితుజేయవె • బుద్ధ్యుద
మీ దేహము నమ్మియాది • కేమని జెప్పన్. 3

బ్రహ్మ—ఓహో శిద్దా ప్రప్రథమమున

మ॥ అంతర్ దారకము గ్రహించవలె సాం • ఖ్యంబొ వారిన్ వలెగా
వలెదానన్ లయమైవసించు వేళత • త్త్వంబున్ విలోకించి ని
శ్చలబుద్ధిన్ యమనస్కమిద్దియనుదీ • క్షన్నిల్చి తానిశ్చితా
చలతత్త్వాసినిపంచబంధములు ద్రెం • చన్ గావలెన్ ముక్తికిన్॥ 4

శిద్ద—అయ్యా ఆతారకమన నెట్టిదో శెలవిండు

బ్రహ్మ—శిద్దా సద్గురూప దేశమంత్రానుష్టానపరుండై ఆరు రంధ్రములను మూయబడు షణ్ముఖియను ముద్రనుబట్టి నీయూర్ధ్వస్థల

ములో బ్రహ్మర్షిలైన దశవిధానంద బ్రహ్మమును గాంచుటయే తారకవిధంబు॥

శిష్య—మహాత్మా సాంఖ్యవృద్ధియెట్టిదియో వచింపుడు ?

బ్రహ్మ—శిష్యా పృథివ్యాపస్తేజో వాయురాకాశాదివిచక్షణయే సాంఖ్య వృద్ధి.

శిష్య—గురువరా పృథివ్యాపస్తేజో వాయురాకాశములను పంచతత్వము లుగదా. అందు నాకాశతత్వపంచకాంతరింద్రియములు నెరుంగ జేయుడు.

బ్రహ్మ— 1 జ్ఞాత 2 మనస్సు 3 బుద్ధి 4 చిత్తము 5 అహంకారము.

శిష్య—మహాత్మా వాయు తత్వ పంచప్రాణములు దెల్పుము.

బ్రహ్మ— 1 సమానము 2 వ్యానము 3 ఉదానము 4 ప్రాణము 5 అపానము.

శిష్య—దేవా అగ్నితత్వపంచకజ్ఞానేంద్రియములు వచింపుడు.

బ్రహ్మ—1 శ్రోత్ర 2 త్వక్కు 3 చక్షు 4 జిహ్వా 5 ఘ్రాణము.

శిష్య—స్వామీ జలతత్వపంచతన్మాత్రలు వచింపుడు.

బ్రహ్మ— 1 శబ్దము 2 స్పర్శము 3 రూపము 4 రసము 5 గంధము.

శిష్య—దేవా పృథివీతత్వపంచక కర్మేంద్రియము లెరిగింపుము.

బ్రహ్మ— 1 వాక్కు 2 పాణి 3 పాద 4 పాయు 5 ఉపస్తలు.

శిష్య—మహాత్మా యీపంచవింశతితత్వంబుల గల్గువాడెవ్వడు.

బ్రహ్మ— స్థూలశరీరుండైన జీవుండు.

శిష్య—అతని పేరేమి.

బ్రహ్మ —విశ్వుడు.

శిష్య—స్వామీ గగనతత్వ పంచకాంతరింద్రియములలో జ్ఞాత యెచట నుండును? యేమిచేయును?

బ్రహ్మ—సహస్రారమందుండి సమస్తవస్తువుల జ్ఞప్తికి దెచ్చుచుండును.

శిష్య— దేవా మనసూ.

బ్రహ్మ—కంఠస్థానమందుండి నానాప్రయాణము లూహించును.

శిష్య—స్వామీ బుద్ధి.

బ్రహ్మ—ముఖస్థానమందుండి సమస్తవస్తువుల వాంఛించుచుండును.

శిద్ద—దేవా చిత్తమో.

బ్రహ్మ—నాభిస్థానమందుండి నానాచిత్తముల జేయుచుండు.

శిద్ద—సామీ అహంకారము.

బ్రహ్మ—ఉదరమందుండి యహంకృతిగర్జించును.

శిద్ద—దేవా వాయుతత్వపంచకములో సమానవాయు వేస్థానమందుండి యేమిచేయుచుండును.

బ్రహ్మ—నాభిస్థానమందుండి భక్షించిన సకలపదార్థములు రసము డెబ్బది రెండువేల నరములకుం సమముగా పంచిపెట్టుచుండును.

శిద్ద—మహాత్మా వ్యానవాయువు.

బ్రహ్మ—శరీరమందుండి రోమములుగగుర్పించి శీతోష్ణాది స్పర్శలదెలియ జేయుచుండును.

శిద్ద—స్వామీ ప్రదానవాయువు.

బ్రహ్మ—కంఠస్థానమందుండి నానావిధములపలుకు పలికించుచుండును.

శిద్ద—దేవా ప్రాణవాయువో.

బ్రహ్మ—వక్షస్థలమందుండి వెనుక వెన్నునను న్నశనాళరంధ్రంబున నెక్కి వినపడుచున్న తారకధ్వనియైన హం క్షం బను రెండు బీజంబుల బట్టి యిడాపింగళియను యెడమ కుడి రంధ్రంబులన సోం అని లో పలలకు హం అని వెలుపలికి ఉచ్ఛ్వాసనిశ్వాసంబుల నడుపు చుండును.

శిద్ద—మహాత్మా అపానవాయువో?

బ్రహ్మ—గర్భమందుండి అంతయూ శోధించి మలమూత్రములను గర్భమునంటకుండాతుడిచిపెట్టి అధోచ్ఛ్వాసమై వెళ్ళగొట్టుచుండును.

శిద్ద—గురుమూర్తీ అగ్నితత్వపంచకములోన శ్రోత్రేంద్రియ మెచట యుండును.

బ్రహ్మ—కర్ణగోళములయందుండి దిక్కుల శబ్దములాలకించుచుండును.

శిద్ద—స్వామీ త్వగింద్రియమో.

బ్రహ్మ—నాభిస్థానమందుండి మజ్జ మెదడు అస్థి నరములు మాంసము

శుక్లము రుధిరము అను నీస ప్తధాతువులను బొదిపెట్టుకొని మనుసుగా చర్మమును గప్పికొని యుండును.

శిష్య—దేవా చక్షురింద్రియమో

బ్రహ్మ—కన్నులయందుండి నానారూపవస్తువుల వర్ణించుచుండును.

శిష్య—జిహ్వేంద్రియమో.

బ్రహ్మ—నాలుకయందుండి షడ్రుచుల గ్రహించుచుండును.

శిష్య—స్వామీ ఘ్రాణేంద్రియమో

బ్రహ్మ—ముక్కులయందుండి త్రివిధగంధంబు నాఘ్రాణించుచుండును.

శిష్య—గురుశ్రేష్ఠవా పృధ్వీతత్వపంచకేంద్రియములలో వాగింద్రియమెటనుండును. యేమిచేయుచుండును.

బ్రహ్మ—వక్త్రమందుండి భూషించి పుణ్యము దూషించి పాపము దెచ్చుచుండును.

శిష్య—స్వామీ పాణేంద్రియమో.

బ్రహ్మ—హస్తములయందుండి పెట్టించి పుణ్యము కొట్టించి పాపము దెచ్చుచుండును.

శిష్య—దివ్యపూరుషా పాదేంద్రియమో.

బ్రహ్మ—పాదములయందుండి పుణ్యక్షేత్రములకు నడపించి పుణ్యము పిత్రులు మొదలగు పూజ్యులకు దాకి పాపము దెచ్చుచుండును.

శిష్య—మహాత్మా పాయురింద్రియమో.

బ్రహ్మ—యోనిప్రజాపతులయందుండి శుక్ల శోణిత మూత్రానంద విసర్జన జేయుచుండును.

శిష్య—దివ్యావతారా! వుపస్థేంద్రియమో

బ్రహ్మ—గుదస్థానమందుండి యేపూట మలమూత్రము లాపుచూ వెళ్ళగొట్టుచుండును

శిష్య—మహానీయా జలతత్వ పంచకేంద్రియములలో శబ్దేంద్రియమెటనుండును? యేమిజేయుచుండును

బ్రహ్మ—లింగస్థానమందుండి ద్వయములోగూడి ధ్వని యిచ్చుచుండును

శిష్య—మహాత్మా స్పర్శేంద్రియమో

బ్రహ్మ—దేహమంతట వ్యాపించి యెక్కడ నేమిసోకినా చేతితో తుడిపించుచుండును

శిద్ద— దేవా గూపేంద్రియమెటనుండును! యేమి శేయుచుండును:

బ్రహ్మ—కన్నులయందుండి కంటికి కనుపడే రూపవస్తువులను చేతికి జిక్కించుచుండును.

శిద్ద—తండ్రీ రసేంద్రియమో

బ్రహ్మ—సాహ్రసారనుండుండి పాదాదిమస్తక పర్యంతమూ పదును జేయుచుండును

శిద్ద—మహానుభావ గంథేంద్రియమో

బ్రహ్మ—ముక్కులయందుండి సకలవాసనలూ యేక సుషుమ్నమందుండి గ్రహించుచుండును

(ఒకభటుడుప్రవేసించి బ్రహ్మముగారికిసమస్కరించి ఒకవుత్తరమిచ్చును.)

బ్రహ్మ—(అందుకొని వుత్తరము విప్పి చదువుమని శిద్దనికిచ్చును)

శిద్ద—(అందుకొనును)

యేకాం—(ప్రవేసించి) (బ్రహ్మముగారికి నమస్కరించి) స్వామీ తమ వూజాగృహంబున కనుదేకుంట చె భక్తశ్రేణి వేగిరింపుచున్నది (అని కూర్చుండును)

(పోతులూరయ్యా - గోవిందయ్యా - గోవిందమ్మగారు - యీశ్వరమ్మగారు ప్రవేసించి)

అంతా కూర్చుందురు.

శిద్ద—బ్రహ్మముగారికి నమస్కరించి అయ్యా చదువుటకాజ్ఞ యిత్తురా?

బ్రహ్మ—(చదువుము)

శిద్ద—వుత్తరమిట్లు జదువును

శ్రీ మక్కా మొదలయిన మశీదులన్గట్టించినట్టిఘనుండును సమస్త మహమ్మదీయ శాస్త్ర విచక్షుండును అల్లాయను దైవభజనాను రక్తుండును మహమ్మదీయ రాజ్యాధినాధుండును నగు నబాబు, పోతులూరి బ్రహ్మముగారికి తెలియజేయునది యేమనగా

యెల్లుండి సాయంత్రము మూడవజామున మత శిద్ధాంత చర్చ

మదీయాస్థానమున జరుగును నీవు తెగిన సన్నాహాముతో తప్పక యీ జవానుతోనే బయలు దేరి రావలయును. ఇది మదీయ శాసనము.

పాదుషా (వాలు—మోహార్.

(అని చదివి నిలచును)

యేకాం—అయ్యా నబాబు యింతకఠినంబుగా బాధ్యతగా బాధించుటకు కారణమేమయి యుండును

గోవిందమ్మ—అదియే బాగుగా విచారింపగాడు

గోవిందయ్య—తల్లీ యిందు విచారింపవలసిన దేమున్నయది యీ శిద్ధని తల్లిదండ్రులు నబాబుగారితో జెప్పి మనకు పంపించిన బహుమానపత్రిక

యేకాం—అట్లులైన సభ పంపించి మన కేమి బహుమానమిచ్చెదరో

గోవిందయ్య—యేమిచ్చెదరా మావాదముసల్పి శిద్ధనివిమయమైన మన కు శిక్షనివ్వ జూచెదరు

యీ—అవును నిజమయ్యే యుండవచ్చును

గోవిందయ్య—అందువలనే మనసన్నిధి నీ శిద్ధను నిల్పవద్దని ఒదుగ నొక్క వక్కాణించితిని

యేకాం—మీమాటలు కెవరు కాదనిరి

గోవిందయ్య—యెవరు కాదనిననూ, యెవరౌననిననూ ప్రస్తుత కార్యోపద్రవాబ్ధి నెవరు వాలలాడ జననుమ్మతులో విచారింపుడు

పోతులూ—యెవరీపని దీర్చబోవువారని విచారింపుచుంటిరా!

గీ॥ తల్లిదండ్రులు బంధులు • తల్లడిలగ
తమమతము బాసి మనదు మ • తంబు జేరె
మనకు మోహంబుగూర్చిన • మాన్యుడెవడొ
వాడె యీకార్యమున కష్ట • బాధ్యుడగును॥ 5

శిద్ధ—(విచారముతో నిలచును).

బ్రహ్మ—వానియొక్క నియమం దేకాదు. నాయందలిగాదు. వచ్చిన వాడువాడయ్యె వుంచినవాడనేనై తి. కావున యిందు కెద్దరమూ పోవలశిన వారమే.

పోతు—(లేచి) తండ్రీ మీవెంట నేనునూవచ్చి పరుషంబులాడెడి వారినెల్ల
నూ మదీయకరవాలంబున తుత్తురుముగావించెద. శెలవిండు.

బ్రహ్మ—కుమార నీకరవాలంబుతో కొంగరినేజయించెదవుగాని అందరి
నీజయింపజాలవు. మేమొకాంతా స్వరూపాశితో నిమిషంబున
అందరిని జయించి వచ్చెదము. నీవిచ్చటనే యుండుము.

నిష్క్రమింతురు తెరరాలును.

కుష్టువ్యాధి గ్రస్తుడగు భర్తతో భార్యయొక చెట్టుక్రింద కూర్చొని యుండును.

భర్త—(దుఃఖముతో) ఆహాకర్మమా నీవలన నేకదా మాయామేయంబైన జగంబు జనించుట పెంపుగాంచుట లయించుటగాన నిన్ను మించువారుండరా లేరు మహాత్మాటకని లేరు.

ఉ॥ ముప్పదిమూడు కోట్లసుర • ముఖ్యులు యెన్నదినాల్గులక్షలై
యొప్పిన జీవకోట్లువిను • లోకుల త్రొబ్బభవాండమెల్లని
న్నెప్పుడు మీరజాలవు నవీన పరాక్రమశక్తివమ్మ వు
ప్పొప్పనిపూదిమమ్మ్ముడు • పుంసరిరెల్లుగమింట లేవకే॥ 6

(లేచి) యింతటన్నైననూ మమ్మువదలిపోమ్మి. పదివేల వందనములాచెరించెదము (అనినమస్కరించి) (భార్యనువీక్షించి) దుఃఖముతో

సీ॥ వ్యాఘ్రఘీభకంఠీరవ | వ్రపకరారావ
మేరీతియోర్చెదె • యిందువదన
కంటకోదగ్రవృ • క్షములపెన్నాపిడి
కేరీతియోర్చెదే • యిందువదన
పదునైన యెదురురా • ల్పాదములతాకున
కేరీతియోర్చెదే • యిందువదన
యత్యుగ్రమగులేపి • హానప్రజాభిల
మేరీతియోర్చెదె • యిందువదన॥

గీ॥ చీమ మాంసంబు నెత్తురు • చిందుచుండ
మూపునందున నర్జెర్చి • మోయుచుంటి
నయ్యొ నీకష్టములనెల్లు • నరయువాడ
నన్ను దేవుండుగావడె • నన్నుతాంగి॥ 7

భార్య—(దుఃఖముతో) భర్తను తన తొడపై పరుండబెట్టుకొని పైట చెరగుతో కనులనీళ్ళు తుడచి) నాధా మీరేల విసుకుచెంది దుఃఖించెదరు. నాకెన్ని కష్టంబులావహిల్లిననూ మీరు సుఖంబుండిన గదా నాకు శ్రేయస్కరంబు మీరు లేకున్న నేనుండుట యెందులకు. అయ్యో నాధా ఆయాసంబుగా నేత్రంబులు మూయుచుంటిరేల భోజనకాలమతిక్రమించుటచే క్షుత్పిపాసలచేడస్సి శోషగనుచుంటిరా అయ్యో అయ్యో నేనేమి సేయుదును.

సీ॥ నామనోనాయకు • నేమాటకైనను
దయజూడరారె గం • ధర్వులార
నాప్రాణవల్లభు • నాప్రియునెల్లిన
బ్రోచిరక్షింపరే • వేల్పులార
నాహృదయాంబుజ • నళినాప్తు రక్షింప
గరిమతో రారె కిం • పురుషులార
నానాధుకీవ్యాధి • నయమొనర్పగరారె
దివ్యౌషధాశ్వనీ • దేవులార॥
గీ॥ ఆర్తివేడుచునుంటి చం • ద్రార్కులార
భక్తిమైనుంటినో నవ • బ్రహ్మలార
మ్రొక్కిడుచుంటి మీకుత్రి • మూర్తులార
దిక్కుమీకన్న మాకేరి • దివ్యులార॥ 8

చం॥ స్థిరమతి తీర్థయాత్రలను • జేసితి జేసితి వైద్యమెంతయో
తిరిగితి నెల్లదేశముల • దేహముడస్సెను నోరుయెండె హా
పరమదయాకరా వృషభ • వాహన యీశ్వరశూలి నామనో
హరునకు దిక్కునీవె యహహా • యిదియేమొకో జహ్వాలాగెరా॥ 9

(అని మూర్ఛబడును)

(బ్రహ్మముగారు, శిద్దడు, సేవకుడు ప్రవేశింతురు)

బ్రహ్మ—(ఆతురముతో) అమ్మా మానినీశిరోమణీ యేల ప్రలాపించి మూర్ఛిల్లెదవు లెమ్ము.

స్త్రీ—(నేత్రములుదెరచి భర్తను సరిగా బరుండబెట్టి లేచి బ్రహ్మము

గారికి నమస్కరించి) స్వామీ మమ్ము రక్షింప సాక్షాత్కరించిన పరబ్రహ్మావతారులై యుండవచ్చునుగాని మాయవస్త యంతయూ నోటితో వచించుటకు క్షుత్పిపాసలచే డస్సియుండుటచే జెప్పజాలకుంటిమి. (అని నిట్టూర్పుతో కూలబడును.)

బ్రహ్మ—పతివ్రతాతిలకమా యీఫలము భుజించి యాపై మీవృత్తాంతము జెప్పుము. (అని యొకఫలమిచ్చును.)

స్త్రీ—(ఆఫలమందుకొని)

ఉ॥ భర్తను తృప్తుజేసి యటు • పై భుజియింతురు దారలన్న మ
ద్భర్తయె కుష్ఠురోగమున • గొల్పడుబాధను క్షుత్పిపాసలం
దార్తిని గుందుచుండగ గ • హాసముతో ఫలమెట్లు దిందు నా
భర్తను బ్రోచి నన్ను పరి • పాలనసల్పుము తండ్రి హా దయన్. 10

(అని మూర్ఛబడును.)

బ్రహ్మ—(ధ్యానమగ్నయించి విభూతి తీసుకొని)

చం॥ పతినతిభక్తితో పరమ • పావనుజేయుగ తీర్థయాత్రలన్
హితమతిసల్పి మోసుకొని • యిచ్చటికిన్ జనుదెంచుచో పతి
వ్రత వడిలెమ్ము నీమగడు • పావనుడయ్యెను చూడుమమ్మ మీ
మతిగలకోర్కెలన్నియును • మానక చేకురె నీకు సత్కృపన్ 11

(అని విభూతి బ్రాహ్మణునిపై చల్లును.)

బ్రాహ్మ—(లేచి తనశరీరము పరికించి చూచుకొని సంతోషముతో భార్యను జూచుచు)

మ॥ కటుదుర్గంధ సువాసితంబయిన మ • త్కాయంబు నేడమె యు
న్నడు పెనట్టి శుభంబుగాంచెయిది గ • న్నన్ నీకు నాశ్చర్యమా
బ్బెడు నిద్రింపగ వేళగాదు సఖి లే • వేయిప్పు రక్షింప భ
ర్గుడో నారాయణుడో విరించియొ లస • త్కార్మిన్ ప్రవేశించెనే॥

(అని లేపును.)

స్త్రీ—(లేచి భర్తను పరికించి భర్తను లేవదీసి బ్రహ్మముగారికి నమ
రింపజేయును.)

సీ. నా మనోహర నిన్ను • నన్ను కాపాడిన
బ్రహ్మావతారుడీ • ప్రవిమలుండు
నా మనోహర నిన్ను • నన్ను కాపాడిన
భార్గావతారు డీ • ప్రవిమలుండు
నా మనోహర నిన్ను • నన్ను కాపాడిన
వైకుంఠవాసుడీ ప్రవిమలుండు
నామనోహర నిన్ను • నన్ను కాపాడిన
పరమాత్ముడైన యీ • ప్రవిమలుండు
గీ॥ యీ మహాత్ముని కరుణచే • యీవు నేను
బ్రతుకగంటిమి లేకున్న • బ్రతుకగలమె
యరయ సాష్టాంగ వందన • మాచరించి
భక్తి గొలుచుట మంచిదో • ప్రాణనాథ. 13

(అని యిద్దరూ సాగిలబడి పాదములు బట్టుదురు.)

బ్రహ్మ.—ప్రతివ్రతా తిలకమా భూసురసత్తమా యిక లెండు. మీ గ్రామమున నొక్క యుత్సవంబు బుట్టనున్నయది. అదియూ గన్నులార జూచెదరు. (అని నిష్క్రమింతురు)

(అందరాలును.)

చతుర్థాంకము సంపూర్ణము.



# పంచమాంకము.

(బ్రాహ్మణులు సభజేసియుండగా)

శిద్ద—(ప్రవేశించును)

బ్రహ్మ—(లేచి యెదురుగావచ్చి) నీదేకులమోయి

శిద్దడు—

ఉ॥ యేకులమంచు నన్నడిగె • దీవు వచింతునుజూడుమయ్య భూ
లోకమటన్న యాదిగల • లోభపునల్కల దుల్పి జ్ఞానమ

భీకరమైన దుడ్డుగొని • బెట్టుగమోదుచు శుద్ధిజేయు దా
దేకులవాడ నార్యజన • దివ్యపదాంబుజ వందనీయుడే॥ 1

బ్రహ్మ—(ఆగ్రహముతో) అవురా యెంత మదించితివి. భూలోక
మను దూడదియందు లోభులనే మురుగ్మ నల్కలగాజేసి దుల్పి జ్ఞాన
మనే దుడ్డుతోమోది శుద్ధిజేయునట్టి సామర్థ్యంపు దాదేకుల
వాడవా (అని చెయ్యి పట్టుకొని)

గీ॥ ఉర్వి పంజారివంశమం • దుద్భవించి
జడలు విభూతిదాల్చిన • చండమేము
నలియబలుకును లేకున్న • తులువయిప్పుడ
గుండెలదరంగ గొట్టుదీ • గుంపుజూడ॥ 2

అని భూలోకానికి కొనిపోవును.

బ్రహ్మ—(ప్రవేశించి) ఆగ్గలారా యూపిచ్చివానినేల హింసింపజూచె
దరు విడుడు.

బ్రాహ్మణు—ఆ యేమనుచుంటివి. యూతండు పిచ్చివాడనుచుంటివా
కాదుకాదు యూతని గురువువైన నీవునూ పిచ్చివాడవే. ఈతని
వదలకుండుట యేకాదు నిన్నునూ వదలము॥

బ్రహ్మ—మొదట నేను మీకు చిక్కనగదా నన్ను మీరు వదలకుండుట.

బ్రాహ్మ—యేమి యిందరిమధ్యవసించు నీవుమాకు జిక్కనేదిక్కవా?

బ్రహ్మ—నిక్కముగా మీకు చిక్కము యెట్లన్న

చ॥ సకల చరాచర ప్రకర • సంభవకర్తగనిచ్చ వెంటనే
సకలములోననిల్చుకొని • సాంగముగా వెలినై యిత్తుపరం
బౌకడనుగాచరించు నను • నొవ్వగబట్టెడు వాడెవండొకో
వికలహృదీశులార యిటు • వ్రేలులపోకడబోకనిల్వరే॥ 3

(రౌద్రముతో)

ఉ॥ ఈసభవారలొక్కరిది • యేమిదురంతము వీరిపైకదు
ర్భాసులమైగడంగుటలు • భావ్యముగాదని బల్కరైతి స
దాభాసుర గేహముల్ విడచి • దుర్మదవర్తన శీలురుండు నా
వాసములన్ దహించుశిఖి • వాస్తవ మొక్కనిమేషమందునన్॥ 4

(తెరబడును.)

(తెరలోపల (బ్రాహ్మలు) అవురా యంతవిచిత్రముగా నున్నయది. మనమందరిని శపించి మనకనుల కంజనము వేసి మచ్చుజల్లి మాయమై పోయిరి. మనగృహములందున పొగలెగయుచున్నది. అనికల్లోలముగా నిష్క్రమింతురు తెర లేచును.)

ఒకవనములో బ్రహ్మముగారు శిద్దడు బ్రాహ్మణభార్యాభర్తలు భటుడు నిలచియుందురు.

బ్రాహ్మ—(పురముపైపు పరీక్షించి బ్రహ్మముగారితో ఆతురముతో)

సీ॥ పొగలెగశెను భూన • భోభాగమాద్యంత
మిదియేమిచిత్రమో • యెరుగనయ్య
కాలాగ్ని కీలలు • గగనంబుకెగబ్రాకె
నిదియేవిచిత్రమో • యెరుగనయ్య
జ్వాలనాగ్నితాపంబు • నలుదిక్కులకు బర్వె
నిదియేవిచిత్రమో • యెరుగనయ్య
మండుకరుల్లైనో • మనదాపుబడుచుండె
నిదియేవిచిత్రమో • యెరుగనయ్య

గీ॥ ఆపురచరాచరంబంత • నగ్నిదగ్ధ
మగుచునున్నది యిదియేమి • యద్భుతంబొ
నందు మాగేహములగాండ • నమరియుండె
దేవదేవమహాసీయల్ దెల్పుమయ్య॥ 5

(అని బ్రహ్మముగారి పాదములబడును.)

బ్రహ్మ—(లేవదీసి) వత్సా సుగుణుల గేహంబులుదక్క తక్కిన గేహంబులన్నియు దగ్ధమగునట్లు శపించితిగాన యిట్లు జరుగుచున్నయది మీగేహంబున కేమాపదయుండదు. ఈయగ్ని చల్లారిన తదువరి మీరాపురంబున ప్రవేశించి మీగేహంబున సుఖంబుండుడు. తిరిగివచ్చు నప్పుడేను మీకు పునర్దర్శనం బిచ్చెద. (అనినిష్క్రమించును.) (తెరపడును.)

(నబాబు శిద్దనిత్రండ్రి యిద్దరు పండితులు సభజేసియుండగా)

భటు—(ప్రవేసించి నబాబుగారికి సలామొనర్చి) అయ్యో ప్రభువుగారు

ఆమహానుభావుని వర్ణింప నాసాధ్యమా? అయిననూ కొంచెము చెప్పెద నాలకింపుము. మీరుబంపగా నేనుబోయి వారితోగలసి యిచ్చటవచ్చు మార్గములోను.

సీ॥ కుష్టురోగార్తిచే • కుందెడు భూసురు
కాయంబు స్వచ్ఛంబు • గానొనర్చి
ఆవలపురిలోన • యమరిన మతవాద
మందున యందరి • నందెదీర్చి
తదుపరిక్రోధులై • గదసినవారల
కగపడకుండ మా • యంబొనర్చి
యొనరించి మమ్మొక్క • యుపవనంబున జేర్చి
పట్టణంబు ద • గ్ధంబొనర్చి
గీ॥ పావవహ్నితో నాపురి • సంహరించి
బోయలెవ్వరు మాయని • పూలపల్ల
కీవయినెక్కి మనసభకు • కీలెరింగి
వచ్చుచున్నాడు బ్రహ్మంబు • వాస్తవముగ॥ 6

నబాబు—(ఆతురముతో) అటులనా వారేరి.

(బ్రహ్మముగారు శిద్దడు ప్రవేశింతురు. అందరులేచి నమస్కరింతురు. )

నబాబు—బ్రహ్మముగారిని చూచి నమస్కరించి, అయ్యా తామీయా సన మధిష్టింపుడు.

బ్రహ్మ—ఆప్రధానమైన వ్యాఘ్రాసనము పరచుకొని కూర్చుండును.

శిద్ద—ఒకచోటకూర్చుండును.

నబాబు—అయ్యా బ్రహ్మముగారు మామతస్థుడైన యీ పీరుసాహెబు కుమారుని యేకారణముచేత మీమతమును జేర్చుకొంటిరి.

బ్రహ్మం—మేమెందులకు జేర్చుకుంటిమి. అతనేచేరెను.

నబాబు—అటులనా అని, శిద్దనివైపు చూచి, శిద్దా మనమతాచారము నుమాని, వీరి మతాచారమున జేరిన దెందులకో వచింపుము.

శిద్ద మనమతమని వారిమతమని వీరిమతమని యెన్నిమతములుండినను దేవు డొక్కడేకదా. తనువులెన్నైనను ఆత్మయొకటేకదా కులము

లైనను బీజమొక్కటేకదా యని జన్మవిముక్తికొరకై పర
మేశ్వరునిగా నీ దేశికుని నెంచి గొలుచుచుండితిని.

నబాబు—అట్లులైన నీ దేశికుడు పరమేశ్వరుడైనందులకు రుజువేమి యా
పగలవో దెల్పుము.

శిద్ద—చూపకేమి.

సీ॥ పరమేశ్వరుండని • ప్రచురింపదగినట్టి
సర్వజ్ఞవైక్య సా • క్ష్యంబుగలదు
పరమేశ్వరుండని • ప్రచురింప దగినట్టి
శంభుకుమార సా • క్ష్యంబుగలదు
పరమేశ్వరుండని • ప్రచురింపదగినట్టి
సర్వమేకాత్మ సా • క్ష్యంబుగలదు
పరమేశ్వరుండని • ప్రచురింపదగినట్టి
శాపానలాగ్ని సా • క్ష్యంబుగలదు
గీ॥ శుద్ధసాత్విక బుద్ధి నెం • చును మహాత్మ
సర్వభూతాత్మయంచు యీ • సాధుమూర్తి
నెన్న నీకు నాకును శక్య • మెట్లు శేషు
కైన చతురాస్యుకైన శ • క్యపడనపుడు॥ 7

నబాబు—ఏమీ నీ దేశికుడు కులమత భేదంబులు లేనివాడ. అట్లైన
మనము భుజించు పదార్థముతో విందు సల్పెదము. సంశయము
లేకుండా భుజింపజేసెదవా.

శిద్ద—అటులనే చేయుదు॥

నబాబు—సేవకునిచూచి, సేవకా మనసువారంబున కేగి పలలాహారంబు
పళ్ళెరమున బెట్టుకొని త్వరితంబుగా రమ్ము.

సేవ— చిత్తము, అని తెరలోనికి బోయి తిరిగి వాకపళ్ళెరముపై ము
సుకువేసుకొని చెంబుతో మధిరము తీసుకొనివచ్చి బ్రహ్మముగారి
ముందు పీఠముపై బెట్టును.

బ్రహ్మం—(కొంచెము ధ్యాన మభినయించి)

సీ॥ విశ్వసృష్టిస్థితి • విలయకారణహేతు
భూతావతారుడై • బాసగితేని

విశ్వంభరాధార • విద్యవతార మూ
ర్తి ప్రభారాశివై • దివిరి తేని
యఖిలాండకోటి బ్ర • హ్మాండనాయకుడవై
యేకస్వరూపిగా • నెసగి తేని
యాదిమధ్యాంత శూ • న్యాతత బ్రహ్మ వా
చాగమ్యవైభవున్నై • యలరి తేని
గీ॥ పీరలాహారము నకు నై • క్రూరవృత్తి
దెచ్చి సీ ఫలహారముల్ • దివ్యమైన
భోజనార్హ పదార్థమై • పొదలుగాక॥
(అని పళ్ళెరము పైముూతదీసి కొన్ని ఫలములు చేతబట్టుకొని జన
ము వైపుజూచి)
అందుకొనుడవే ఫలములు • నారగింప॥ ౪

(అని యిచ్చును)

సభవారందరు జై మహానుభావాయని చప్పట్లుగొట్టుచూ ఫల
ములందుకొని దినుచూ నిష్క్రమింతురు. (తెర రాలును)

(మాశ్వరమ్మగారు పోతులూరయ్య గోవిందమ్మగారు గోవిందయ్య
గారు యేకాంబరయోగి సభదీరి కూర్చొనియుందురు)

(తెర లేచును)

పోతు—(గోవిందమ్మగారిని జూచి) తల్లీ నాల్గు దినంబులైననూ మా
నాన్నగారు యెందుకో రాకున్నవారు అచటేమి కలహంబు
వాటిల్లినదో
గోవిందమ్మ—ఏదోకొంచె చర్చ గల్గినట్టులే యున్నయది
గోవిందయ్య—నిజమయ్యే యుండవచ్చును
యేకాం—అయ్యో యింకెట్లు నేను బోయి వత్తునా
మాశ్వ—యెందులకు మీరింత విచారించెదరు. అన్నివిధంబుల జయంబు
గైకొని సుఖస్థితి నేడిచటికి మా జేజినాయనగారు శీఘ్రమూ
రానున్నవారు

(అన్నాజీ అప్పాజీ ప్రవేశము)

గోవిందయ్య—(వారిని అర్హాసనముల గూర్చుండబెట్టును కూర్చుందురు)

అన్నాజి—బ్రహ్మముగారెట కేగిరి
గోవిందయ్య—నబాబు పిలిపించితేపోయిరి
అప్పాజి—యెప్పుడువత్తురు
యాశ—నేడేవత్తురు

(తెరరాలును నిష్క్రమింతురు)

(బ్రహ్మముగారు శిద్దడు సభలో కూర్చుందురు)

బ్రహ్మం—(సంతోషముగా)
సీ॥ కౌండిన్య మైత్రేయి • కౌసిక కశ్యప
కణ్వాశ్రమంబుల • గాంచినాము
జమదగ్ని జాబాలి • జైమిని జహ్నుని
కపిలాశ్రమంబుల • గాంచినాము
మౌద్గల్య మాండవ్య • మందపాల మతంగ
గర్గాశ్రమంబుల • గాంచినాము
వాలఖిల్య వసిష్ఠ • వరతంతు వల్మీక
కౌతాశ్రమంబుల • గాంచినాము
గీ॥ శుకశౌనకాశ్రమముల • జూచినాము
అల యగస్త్యాశ్రమంబెల్ల • వరలినాము
గాంచవలసిన తపసుల • గాంచినాము
యోగమహిమాను వశిమచే • నోరిశిద్ద॥ 9
శిద్ద—చిత్రము తమ మహిమచే నేనునూ గాంచితి
(అప్పాజి అన్నాజీగార్ల ప్రవేశము)
బ్రహ్మం—(లేచి వారిద్దరిని కౌగిలించుకొని) తాము వ్రాయు కాలజ్ఞానము
పూర్తియైనదా
అన్నాజి—అయినది (అని యొకపుస్తకము చేతికి యిచ్చును
బ్రహ్మం—రహస్యస్థలమున కేగుదమా
అప్పాజి—అటులనే త్వరజేయుడు
బ్రహ్మం—శిద్దా నీవిటనే కూర్చొనియుండుము. వీరితో మాటలాడి వచ్చె
దను అని తెరలోనికి ముగ్గురూబోయి తిరిగి బ్రహ్మముగారొక్కడే

ప్రవేశించి శిద్దా యీరోజు సాయంకాలము అయిదు ఘంటల
ప్రొద్దుండునంతకు కొన్ని ఫలపుష్పంబుల గొనిదెమ్మ పూర్ణ
కటాక్షమిచ్చెద.

శిద్ద—చిత్తము (అని నిష్క్రమించును తెరవ్రాలును)

(గోవిందమ్మగా రొక్కతే ప్రవేశించి దుఃఖముతో)

గో—హా మన్నోనాయకా నిను రెండవపుత్రుండయిన పోతులూరయ్యకు
కారణమిమ్మని నేనెంతో బాధించినను కటాక్షింపవైతి వింకెవ్వరా
తనికి దిక్కు

బ్రహ్మ—ప్రవేశించి కామినీమణీ నీవేల యింతచింతించెదవు నిన్న నే
కక్కిన కూటినెవరు భుజించిరి చెప్పుమా

గోవిందమ్మ—శిద్దుడు భుజించెను

బ్రహ్మ—మనవాడెందులకు భుజింపడయ్యె

గోవిందమ్మ—సంశయాత్ముడగుటవలన

బ్రహ్మ—అట్టివాని కెట్లు కారణమిచ్చుట

గోవిందమ్మ—యింక వానిగతి యెట్లు.

బ్రహ్మం—నీవు శీఘ్రముగా నేను జెప్పబోవు రహస్య మెవరికీ జెప్పవుగదా.

గోవిందమ్మ—అట్లనే జెప్పను.

బ్రహ్మం—ఈ రోజునే నవతారంబు చాలించి నిర్వికల్పసమాధ నిష్టాగరి
ష్ఠుండగానుంటిని.

గోవిందమ్మ—ఆహా అయ్యో నిమతో పాటు నేనునూ సమాధియందు
ప్రవేశించెద.

బ్రహ్మం—ఇప్పుడుగాదు. పోతులూరయ్య శాపము తీరిన పిమ్మట

గోవిందమ్మ—అయ్యో ప్రాణేశ్వరా పోతులూరయ్యకు శాపమెక్కడిది.

బ్రహ్మం—అఖండొక కారణంబున నాసమాధిద్వారము లు దెరచి నా
తపోభంగ మొనర్చుటచే నేనాతనిని వ్యాఘ్రుంబగునట్లు శపింప
నీవేతెంచి పుత్రభిక్షబెట్టుమని ప్రార్థింప దయాపూర్ణభావుం
డనై ఆరుమాసంబులు పగలువ్యాఘ్రుంబుగా రాత్రిమానవుం
డుగానుండి అల్లాడుపల్లె వీరభద్రాలయంబులో తపంబాచరిం

ప్రభూ ఆరవమాసాంతంబున వీరభద్రునివలన కారణంబంది శాపవిమోచనుండయి త్రిలోకపూజ్యుండగు నంతవరకూ యిట నుండవలసినదానవే, తప్పదు. నూరుమాటాడకుము. (అని తెగ వైపుజూచి) యేకాంబర యోగిని త్వరగా యిటురమ్ము.

యేకాం—(ప్రవేసించి) అయ్యా సమాధినలంకరించి వచ్చితి

బ్రహ్మం—అట్లయిన గోవిందయ్యను, యీశ్వరిని, పోతులూరయ్యను త్వరితంబుగా పిల్చుకొని రమ్ము.

యేకాం—(చిత్తము అని వారిని ప్రవేశపెట్టును నమస్కరించినిలతురు)

బ్రహ్మం—గోవిందయ్యను వ్యాఘ్రాసనముపై గూర్చుండబెట్టి.

ఉ॥ సద్యశకూర్జితాత్ముడవు • స్నానము సంధ్యయు నిత్యసత్క్రియా
కోద్యమకార్యనిర్వాహుడ • వోయికునూగడ ధూపధీపనై
వేద్యములెల్లకాలము • పీఠముకిచ్చుచు పూజసల్పని
ర్విద్యనొసంగుచుంటి సర • శిగ్ గొను సాగునచింపకెద్దియుఙ్ ॥ 10

(అని ఖవస్త్రమిడి మంత్రోపదేసించి) తిరిగి పీఠముపై కూర్చుండి యీశ్వరమ్మగారిని తన తొడపై గూర్చుండ బెట్టుకొని.

ను॥ పరిపూర్ణేశ్వరి యీశ్వరీవినవె యీ • భక్తవజంబుల్ దగూ
పరిపూర్ణాత్మను మోక్షమార్గమున బో • వఙ్ జేయుసద్బోధవై
యురుభావంబున యోగదండమిక నీ • వోయమ్మ బోధించనై
గరిమన్ పీకశిలిన్ గ్రహించు మిదిలో • కంబంత నీ ంచెదుఙ్ ॥ 11

(అని యోగశాస్త్రమిచ్చి పోతులూరయ్యను తొడపయి గూర్చుండ బెట్టుకొని)

ను॥ అతిరౌద్రుండవు యెమెరుంగవు మదీ • యాజ్ఞబ్రవర్తింపుచుం
డితివిజ్ఞాళ్ళు సమంజసంబుగను బ్రో • ఛిన్ బాల్యచాపల్యమే
గతినైనన్ విడనాడి మీజనని శిష్యుఙ్ శుద్ధసత్వైక శ్రీ
లతవేగాంచుకుమార మీరినను చాలామోసమబ్బున్ జుమీ॥ 12

(తెరవాలును అందరు నిష్క్రమింతురు)

(అరణ్యములో శిద్దడు వక్కడే ప్రవేశించి విచారముతో)

సీ॥ ఫలపుష్పములు చూత • వనమున బరికింప
గనుపడవిదియేమి • కారణంబొ

ఫలపుష్పములు నింబ • వనమున బరికింప
గనుపడవిదియేమి • కారణంబొ
ఫలపుష్పములు బిల్వ • వనమున బరికింప
గనుపడవిదియేమి • కారణంబొ
ఫలపుష్పములు జంబు • వనమున బరికింప
గనుపడవిదియేమి • కారణంబొ॥

గీ॥ యేమికారణమయిన నే • నేమి సేతు
పుష్పఫలములు గొనకెట్లు • బోవువాడ
యిపుడె యీయాగ్నిలోనుంచి • యీకుదుమికి
బ్రహ్మమునకర్పించ ప్రాణముల్ • బాయువాడ॥ 13

(అని దుముకబోయి అటు పరిశీలించి సంతోషముగా)

మ॥ అపగోనచ్చట పుష్పముల్ ఫలములు • త్యాశ్చర్యముప్పొంగగా
నివసించెగానిపోయి వాంఛితఫలా • నీకప్రధానైకదీ
క్షవశీ దీర్ఘాదు దివ్యమూర్తికనిమా • క్షుప్రాప్తిగైకొందు సం
భవరాహిత్యమగందు బ్రహ్మమును భావంబందుగందుక సదా॥ 14

(అని పుష్పములు గోసుకొని పళ్ళెరమునబెట్టుకొని తెరలోనికేగి తిరిగివచ్చి ప్రవాహమునుగాంచి చేతులుజోడించి)

సీ॥ ఎవ్వడుమూర్తిత్రయ • యేశ్వరుడైయుండు
పరమాత్మరూపమై • బరగుచుండు
యెవ్వడునిర్గుణుం • డెవ్వండు సర్వమ
యుం డెవ్వడాధ్యుడై • యుర్వియందు
యెవ్వడుసృష్టించు • నెవ్వడు పోషించు
యెవ్వడీజగము లి • యించుచుండు
యెవ్వడు మునిహృద • యేప్సితంబు గన్చి
మోక్షంబు నిచ్చెడు • దీక్షనుండు

గీ॥ అట్టి మహాస్వామి నర్చింప • నరుగుచుంటి
ఘోరవనమున నొంటిగా • గుందుచుంటి
నమ్మమందాకినీదారి • నిమ్మునాదు
స్వాంతమందున నిన్ను సం • స్మరణ జేతు॥ 15

(అని ముందుకునడచి) ఆహా యీగంగాభవాని నాయందుదయా పూర్ణభావయై త్రోవనిచ్చుటయెంత విచిత్రంబు. ఇదియంతయూ నా పరంధాముః మహిమగాక వేరుండునా (అనిని్రష్క్రమించును తెరవాలును)

(సమాధియందు ప్రవేశించగా. గోవిందయ్య భార్య- గోవిందమ్మ గారు యీశ్వరమ్మగారు- హారతి పళ్ళెరము పట్టుకొని

యీ—సీ॥ అండపిండాండ బ్రహ్మాండంబులంటని
రంగ ప్రభాయిదే • మంగళంబు
గో—కంటికిన్ మింటికిన్ • రెంటికిన్ జతగాని
రంగప్రభాయిదే • మంగళంబు
యీ. —నిగమాంత వేద్యమై • నిష్కళాతీతమౌ
రంగప్రభాయిదే • మంగళంబు
గో-భా—ఆదిమధ్యాంతరం • బంతశూన్యంబైన
రంగప్రభాయిదే • మంగళంబు
యీ- గీ॥ వాసనత్రయనాశ స • ద్వ్యసన వి
నాశ యష్టమద వినాశ • ఈశ దేవ
గో— చండికాంతఃకరణ చతు • ష్టయగతేశ
మండితాచల నీకిదె • మంగళంబు॥ 16

(అని హారతియిత్తురు- అందరూ పుష్పములుచల్లి నమస్కరింతురు తెరరాలును)

(శిష్యుడు పుష్పములు తీసుకొని ఒక్కడే ప్రవేశించి విచారముతో)

మ॥ జగదాశ్చర్యకరప్రభావ త్రిజగ • త్సామ్రాజ్య వైభోగ ది
వ్యగురు ప్రాభావ సద్వశిష్ఠ శుక క • ణ్వాత్రేయ వాల్మీక సా
నగ శాతాతప నారదాదిముని ధ • న్యస్తోత్ర వ్యాఖ్యానమా
నిగమాతీత చరాచరాప్రకర సా • క్షీ భావనిర్వాహకా॥

మా— అయ్యో నా తండ్రీ!

సీ॥ పాకశాలలలోన • బరికించి జూచితిన్
కారణంబేమొకో • కానరావు

హానభా మంటపా • భ్యంతరంబునజూడ
కారణం బేమొకో • కానరావు
భక్త మంటపమున • పలుమారు వెదకితి
కారణం బేమొకో • కానరావు
నర్చితమంటపా • ద్యంతంబు వీక్షింప
కారణం బేమొకో • కానరావు

గీ॥ ఒనర దేవుడు లేని దే • వస్థలంబు
గతి దనరి మంటపంబులు • గానబడియె
(అని ఆలోకించి) అదిగో
అచట భేరి కాహళరావ • మలరుచుండె
నిర్వికల్పసమాధిని • నిలచితేమొ॥

(నిష్క్రమించును. తిరిగి ప్రవేశించి శిష్యుడు అందరు జూచుచుం
డగా సమాధిచుట్టూ ప్రదక్షిణము చేయుచూ)

—* దండకము. *—

శ్రీమన్మహాదేవ శ్రేష్ఠప్రభాభావ భూతేశ లోకేశ దివ్యస్వరూప ప్రకాశానసుర స్ఫురాలోకింపించి నన్నింతో నమ్మించి నాకొంపయుం ముంచి నా దుంపయుం ద్రెంచి కార్పణ్యమూహించి కాంతారమందెన్నో కష్టంబులుప్పొంగ గల్పించి నొప్పించి కాలంబ కాలంబు గావించియంతం సమాధిం బ్రవేశించి యున్నావు నాకిక్క డెవ్వారు దిక్కుండి రంచుం మదిం గొల్చుచెనుందు నో దేవ నాజన్మ రాహిత్యముం బొందు నీయొక్క మంత్రోపదేశంబునుం గాంచ గొండంత యాశం భవత్సన్నిధిం నమ్మి యున్నట్టి వాడం గ యీవిధిం జేయ మర్యాద? నాప్రార్థ నాలింప రాగాద నాతోడ వాహా ధరా చక్రమల్లాడనీ చంద్రుడుం సూర్యుడుం మార్గముల్ దప్పనీ వార్ధులింకంగనీ శంకరుం కంటిమంటారనీ మూడు లోకంబులుం నాశముంగాని తారల్ భువిం రాలనీ ప్రాణముల్ బోని యేమైనగానీ మదీయోత్తమాంగంబు యేకాగ్ర చిత్తంబునం ప్రక్కలై పోవ నీద్వారమున్ముంగు యీ బండకుం సూటిగాగొట్టి నాజన్మ జాలింతు భావింతు బ్రహ్మోవతారాయ పోతులూరి వీరాయ ధీరాయ ఓంకార రూపాయ అహా నమస్తే నమస్తే నమస్తే.

అనినమస్కరించి సమాధి యందకు తల గొట్టపోవును. అంతట ద్వారములు విడిపోవును. బ్రహ్మంగారు సాక్షాత్కరించి శిద్దని కౌగిలించుకొని

మ॥ భళిరా శిష్యుడవన్న వీవెగద స • ద్బ్రహ్మార్థమున్ దెల్య భూ
సిలువాడెవ్వడు యింత దీక్షగొని ని • ల్చెన్ పూర్వ మారామచం
ద్రుని సచ్ఛిష్యుడు నాంజనేయుడను ను • ద్దోషా(భుజంఝానిలుం
డల శ్రీకృష్ణుని శిష్యుడర్జునుడు యు • ట్లర్థించి వర్తించిరే. 19
చూడుము

సీ. హనుమంతుడా రాము • నాత్మార్థమెరుగంగ
శేవించి భృత్యుడై • జెలగ లేదు
అర్జునుడా రాము • నాత్మార్థమెరుగంగ
శేవించి భృత్యుడై • జెలగ లేదు
హనుమంతుడా రాము • నావహంబందున
శేవించి భృత్యుడై • జెలగ లేదు
యర్జునుడా కృష్ణు • నావహంబందున
శేవించి భృత్యుడై • జెలగ లేదు
గీ॥ ఆజ్ఞమీరని సత్కీర్తి • నాంజనేయు
డంద లేడీల నాడు కా • లాంతమందు
కృష్ణ లేవదీసినకీర్తి • శ్రీశిఖార్థి
నంద లేదదినాకు ని • పొంద లేదు.

నా—నీవన్ననో యొకరి ప్రేరేపణయే లేక కడు చిన్నతనములోనే.

సీ॥ తలితండ్రులను బాసి • యాత్మార్థమెరుగంగ
దేశ దేశంబుల • దిరిగినావు
వర్ణించి గురువుల • స్వారస్యమును గాంచి
కోరి మత్సన్నిధి • జేరినావు
తలితండ్రులరుదెంచి • తగవాడ వినకప్పుడె
మీరి మా శేవలో • దూరినావు
సమయంబునకు సుమ • చయ ఫలముల కని
బొమ్మన్న యడవికి • బోయినావు

గీ॥ అచట కష్టంబులుమరిన • యనుభవించి
తుదకిచట రాగకాలంబు • పూర్తిపోగ
బ్రతుకు విడనాడ నిశ్చయ • భావమూని
క్షితిని యాశవ గంటివి శిద్ధ • చిత్తశుద్ధి॥

శిద్ధ—ఆర్యా! నమస్కారము నన్నింత గణుతించెదరు.

సీ॥ నేను యీజన్మలో • జ్ఞానుండనై నట్టి
కారణంబరయ మీ • కరుణగాదె
నేను మీ సన్నిధిని • మానకవసియించు
కారణంబరయ మీ • కరుణగాదె
కాంతారమున నగల్గు • కష్టంబులను కాయు
కారణంబరయమీ • కరుణగాదె
ఘోరదీక్షను మది • గుదురుగానిల్పిన
కారణంబరయ మీ • కరుణగాదె
గీ॥ సాంఖ్య తారకయమనస్క • సరణి దెలసి
పూర్ణతత్త్వంబు నిత్యము • పూర్ణసిద్ధి
జేసి జన్మరాహిత్యు నై • వెలగునట్టి
కారణం బరయంగ మీ • కరుణ గాదె॥

బహ్మ— అవును యిటువినుము.

మ॥ తను తాదేహ్యని మూర్ఖమానసుని స్వాం • తంబుగ్రమత్తద్విపం
బనసంచారిము నిల్పుచుండు పరత • త్త్వార్థంబునుగాంచు స
జ్జను స్వాంతంబు లయంబుజెందుబహుపు • ష్పభ్రాంతభృంగంబు చ
య్యాన సంపెంగసుమంబు సోకినలయుం • బౌరీతి శిద్ధాభువిన్॥

మా—కావుననీవు

సీ॥ శ్రీవిరాట్పదసర • సీరుహద్వంద్వ పూ
జాసరోవరహంస • సరణినిలచి
శ్రీవిరాటాఖ్య సం • స్మృతివిశేషములచే దు
గ్ధాంబుధీ చంద్రు వి • ధంబుదవరి

శ్రీవిరాడ్దివ్య చా • రిత్ర విస్ఫురత్కథా
జలదవార మయూర • సామ్యమమరి
శ్రీవిరాట్సుగుణము • శ్రీ ధ్యానరాకా ని
శాధీశ్వర చకోర • మట్లు జెలగి
గీ॥ అతుల శ్రీవిరాట్తత్త్వమ్ము • తాంబుజాత
జనిత మకరంద మదభృంగ • మనగ వెలసి
పరమ శ్రీవిరాట్సాయుజ్య • పదసువర్ణ
సరసమణి మందిరనివాస • మరయువలయు॥ 24

మా—ఆవిరాట్ప్రభుండు

సీ॥ కన్నులనడుమను • సన్నంపుదిడ్డిలో
తిన్నగా వెలిగెడి • వన్నెకాడు
ఫాలభాగమునందు • నీలంపు జ్యోతుల్ల
వాలలాడుచునుండు • వన్నెకాడు
చూపులలోపల • పాపల నడుమను
వ్యాపించివెలిగెడి • వన్నెకాడు
చత్వరాగ్రమునందు • సాక్షాత్కరింపుచు
వైభోగముగవెల్గు • వన్నెకాడు
గీ॥ నిర్వికల్పసమాధిని • నిలచువాడు
నేనువాడనుభేదంబు • లేనివాడు
నచల పరిపూర్ణుడై ధాత్రి • నలరువాడు
అద్వితీయతనీలోన • యమరెచూడు॥ 25

మా—వాడే

సీ॥ రహిమహిసప్తావ • రణనవద్వారపు
రబరివేష్టిత పురి • రమ్యుడగుచు
శుద్ధ సాత్వికమనో • సూక్ష్మబుద్ధిని మంత్రి
గానొనరించి స • క్రముడునగుచు
నిలద శేంద్రియభృత్యు • లను వృత్తిగల్వ ప్ర
పంచమనిత్యప్ర • భావుడగుచు

పటుతురీయ సభా • భవనమున హృదయసిం
హాసనాసీన సం • వాసుడగుచు
గీ॥ పవనచామరములు విద్య • భటులువీవ
దవిలి ప్రాజ్ఞుడు కీర్తి ఛ • త్రంబు నెత్త
నెరుక సద సద్వివేక హే • చ్ఛురికెసలుప
ముక్తి కామిని వామాంక • మున వసింప
వెలగు బ్రహ్మంబునేనె ప్ర • శిద్ధ శిద్ధ॥ 26

మా—ఇప్పుడు నీవు తారక సాంఖ్యామనస్క యోగంబుల నెరింగెరింగి వృద్ధాప్యుండవై తొ. పంచభూతంబులంబాసి గగనతత్వంబై యొకటేనిలచియుండే సకలమూ దేహ యుటకు తాను యెరుకై యుండే దనక పరపూర్ణం బెరిగించెద నాలకింపుము.

పరిపూర్ణబోధ.

1 ఈపు ప్రట్టయులు యేమీ లేదు.) యిదిద్వాదశాక్షరీ మహా మంత్రము॥

2. ఆయెరుకను విశేషించుటకు నీకట్టు నా దేహాలు యేలాగా ఆలాగె) యిదియే పంచదశాక్షరీ మహామంత్రము.

3. ఈతనువును విశేషించుటకు (నీమూలం లేని శరీర మేమీ లేదు.) యిదియె షోడశాక్షరీ మహామంత్రము. యింతకన్నను వేరు లేదు యిదియె పూర్ణబోధ యిచ్చితి ముక్తిగాంచుము.

శిద్ధుడు—(చేతులు జోడించి) మహాత్మా ఆనందమానందము.

సీ॥ శ్రీమదఖండ స • చ్చిత్సుఖ సామ్రాజ్య
బ్రహ్మవతార తు • భ్యంనమోస్తు
అనను సూనైక ది • వ్యానంతకళ్యాణ
బ్రహ్మవతార తు • భ్యంనమోస్తు
విశ్వోద్భవస్థితి • విలయకారణమహా
బ్రహ్మవతార తు • భ్యం నమోస్తు
సకలచరాచర • జంతుజాలాన్వితా
బ్రహ్మవతార తు • భ్యంన మోస్తు

గీ॥ పరమనిర్గుణ భావతు • భ్యంనమోస్తు
అమరవందితాధీశ తు • భ్యంనమోస్తు
వాదభేదవిరహిత తు • భ్యంనమోస్తు
వరనిరంజనసాకార తు • భ్యంనమోస్తు 27
(అనినమస్కరించును.)

బ్రహ్మ—శిద్దానాగురుండగు అల్లాడుపల్లె వీరభద్రుండు.

సీ॥ రాజయోగ మెగదా • రంజిల్లు సంసార
జలరాశి దాటించు • సరళినావ
రాజయోగ మెగదా • రంజిల్లుయజ్ఞాన
తిమిరాళి నడగించు • దీపకళిక
రాజయోగ మెగదా • రంజిల్లు పాపౌఘ
ఘోరకాంతార కు • దారిమహిమ
రాజయోగ మెగదా • రంజిల్లు చతురాంత
రింద్రియ జలజక • రీంద్రసమము
గీ॥ సరస వేదనురాళి కా • సారవిమల
మరయ ముక్తిమార్గ నిరీక్ష • కాంజనంబు
నట్టి రాజయోగముబూని • యద్వితీయ
బ్రహ్మపద విని గాంచుచు • బరగనయ్యు॥ 28

బ్ర—అని బోధించుటవలన నే నారాజయోగంబవలంబించితి. నీవు
నాయాజ్ఞప్రకారము యీరాజయోగమునందు ప్రసిద్ధిగాంచుము.
సత్యము దప్పకుము. (అని సమాధియందు ప్రవేశించబోవును.)

శిద్దడు—ఆతురతతో, అయ్యా అయ్యా నాకొకకోరికగలదు దీర్చుడు.

బ్రహ్మం— వెనుకకు మరలి, కొంచెము ధ్యానమభినయించి, ఆహా తెల
సితి నిత్యము నాపాదుకలు పూజించు కౌతూహలము. నీకుగ్గ
నది. గావున యివిగో గొనుము. అనియిచ్చును.

శిద్దడు — మహాప్రసాదమని (అందుకొనును.)

బ్రహ్మ—(సమాధిప్రవేసించును.)

శిద్దడు—(బ్రహ్మముగారిని చూచును,)

మ॥ అనుగుణ్యంబగు దేహపట్టణసుషు • మ్నాంతఃపురంబందు భ్రాం
తిని సోహంబను హంసతూలికపయిన్ • దివ్యంబుగా చిత్కళల్
ప్రణవారావములున్ జెలంగ రుచులొ • ప్పన్ శాంతికాంతన్ దృఢం
బున కేళిన్ దనియింపబోయితివహో • మూర్తిత్రయబ్రహ్మమా॥ 29

ద్వి॥ సరియైన గురువుల • సన్నిధిన్ వసియించి
శిష్యులు మోక్షులై • జెలగుగాత
గోవిందయ్య॥ పరతత్త్వమునుగాంచు • ప్రౌఢిచే శిష్యులు
గురువులయాజ్ఞ చే • కూర్తుగాత
శిద్ధ॥ శిష్యుల గురువులు • శీఘ్రంబుగా మోక్ష
పరులను జేయగా • ప్రబలుగాత
హాళ్వ॥ తీవ్రమోక్షేచ్ఛులై • స్థిరభక్తి జరియించు
దాసుల దేవుండు • దనరుగాత

గోవింద॥ గీ॥ భవమభవములు ద్వైతము • ద్వైతములును
యుర్వి సత్తుచిత్తులు లేక • యుండుగాక 30
శిద్ధ॥ ఖేదమోదంబులునుగాక • సాదరముగ
వెలుగు జ్యోతిర్మయాకార • మలరుగాక॥

(అవనిక పడును.) (అందరు నిష్క్రమింతురు.)

శ్రీ విగాడ్బ్రహ్మార్పణమస్తు.

---